నే మరాటావారును దనయాజ్ఞ లేక శస్త్రమును ధరింపగూడ దని యాజ్ఞాపించెను. ఇన్ని కట్టుదిట్టము లేర్పరుచుకొని నప్పటికి శివాజి తన యప్రతిమ యుక్తిచే నాతనిని మోసపుచ్చెను! శివాజీ తన యొద్దనున్న యిద్దరు గుమస్తాలను బంపి ఖానుని సైన్యములోని యొక మరాట సిపాయిని వశపరచుకొనెను. వాడు ఖానునితో 'నాయింట నేడు వివాహకార్య మున్నది. కాన మంగళ వాద్యముతో బట్టణములో నూరేగింపు చేయుటకు నాజ్ఞ కావలయు'నని చెప్పి యట్టి యనుజ్ఞ వడసెను సాయంకాలసమయమున శివాజి కొంత సైన్యముతో సింహగడముదిగి క్రిందికివచ్చెను. అక్కడనుండి బయలుదేరి త్రోవలో నక్కడక్కడ కొందరు సైనికుల నుంచుచు పూనాపట్టణము నకు వచ్చి చేరెను.

తాను జేయవలసినపని చేసి తిరిగి వెళ్ళునప్పుడు శత్రు సైనికులు తన వెంట దరిమికొని రాకుండ నాతడు మొట్టమొద టనే యొకయేర్పాటు చేసియుండెను. సింహగడము త్రోవ కాక మఱియొక త్రోవను దాను దనసైనికులును బోయిరని శత్రువులకు భ్రమ కలుగవలయు నని కాత్రజు పర్వతములకు బోవు దారి వైపున నచ్చటచ్చట వృక్షములకును ఎద్దుల కొమ్ములకును గుడ్డలు కట్టి సిద్ధముగానుంచి యేర్పాటు ప్రకారము శార్ఙ్గధ్వని కాగానే కొలది సైనికులా గుడ్డలకు నిప్పు ముట్టించి శంఖశార్ఙ్గనాదములు చేయుచు దను తమ తావులకు బారిపోవునటుల నేర్పాటు చేసెను. ఇట్లు సిద్ధముచేసి శివాజీ

తనవెంట తానాజి మాలసురే 'సాజికంక్ డాదాజీబాపూజీ దేశపాండే మొదలైన విశ్వాస పాత్రులును గణగంగ భీములును నైన యిరువదియైదుగురు సరదారులను వెంట దీసికొని తాను వశపరచుకొనిన సిపాయి యొక్క యూరేగింపులోని పెండ్లివారివలె నటించుచు గ్రామములోనికి జేరెను.

అర్ధరాత్రి వేళ గ్రామ మంతయు నిద్రపోగా, శివాజీయు నాతనిసరదార్లును పూనాపట్టణములోని సందుగొందులన్నియు నెరిగినవా రగుటచే శాహిస్తేఖాను యేర్పరచిన కావలివారి నందరను దప్పించుకొని ఖానుడున్న మందిరము యొక్క యావరణములోనికి జేరిరి. అక్కడ నొక గవాక్షముద్వారా పై యంతస్థు పైకి నెక్కిరి. కాని యింతలో గొంచెము శబ్దమైనందున స్త్రీలు మేల్కొని యేమో మోసమున్నదియని భీతినొంది ఖానుడు నిద్రించుచున్న గదిలోనికిబోయి యాతని లేపిరి. ఇక దానుదప్పక చచ్చెదననితలచి ఖానుడొక గవాక్షములోనుండి క్రిందికి దుమికి పారిపోయెను. కాని యాతని దుముకు సమయమున శివాజీ వెంటనున్న వారిలోని యొకడిసుకు కత్తితో వేయగా ఖానుని చేతివ్రేలొకటి తెగెను. వ్రేలుపోయినను ఖానుడు ప్రాణము దక్కించుకొనెను. కాని యింకొక గదిలో నున్న యాతనికుమారుడు శివాజీ చేతిలోబడి మృతు డయ్యెను. శిబిరములో నంతట శివాజీ వచ్చెనన్న కలకలధ్వని పుట్టి సైనికులందరు భయభ్రాంతులైరి. ఇంతలో సంకేతానుసారము కాత్రజు గుట్టల వైపునుండి గుఱ్ఱలముట్టించిన వెలుతురును

*కొమ్ముల మ్రోతయు రాగా మోగలులు శివాజీ యటుపోవు చున్నాడనుకొని సింహగడముత్రోవ విడిచి యటువైపులకే పోవసాగిరి. కాని కొంతదూరము వెళ్ళిన పిదప శివాజీచేసిన మోసము వారికి గోచర మయ్యెను.

ఇటు శివాజీతనయుక్తిచేతను, సాహసముచేతను శత్రువులను బూర్తిగా బరాభవించి తనసైన్యముతో సింహగడము నకు వెళ్ళెను. (౧౬౬౩ ఏప్రిల్)

ప్రాతఃకాలమున మోగలులసైన్యము మహాకోపముతో శంఖభేరీరవములు చేయుచు సింహగడముపైకి నెత్తివచ్చెను. శివాజీ యాసైన్యముల వోటనే యెదిరింపక వాని నన్నింటిని బూర్తిగా దుర్గముక్రిందికి రానిచ్చెను. తురకసైన్యములు ఫిరంగి దెబ్బ తగులునంత సమీపమునకు వచ్చినతోడనే యొక్కసారి ఆసైన్యములపై ఫిరంగులవర్షము కురియింపసాగెను. సహింప లేని యాదెబ్బలకు శత్రువుల ఏనుగులు పీనుగు లయ్యె. పతాకలుక్రిందగూలె. సైనికులు భయభ్రాంతులై చెల్లా చెదరైరి. ఇంతలో నచ్చటదాగియున్న కడతాజిగుజర్ నేతాజి పాల్కర్ ఈ మరాటా వీరులు తమసైన్యములతో మోగలు లపై బడి యిదివరకే భయభ్రాంత మయిన యాతురకసైన్య మును బూర్తిగా నోడించి పార ద్రోలిరి. ఇట్లు మరాఠా వారిచే మోగలులు సంపూర్తిగా బరాభూతు లయిరి.

---

* హ్యానిబాల్ అనుకార్ధేజ్ సైన్యాధీశ్వరు డిటులనే యెద్దుల కొమ్ములకు గుడ్డలుకట్టిముట్టించి రోమన్ జనులను మోసపుచ్చెనని రోమకచరిత్ర ము-ం దున్నది.

జరిగినపరాభవమువలనను, పుత్రవధవలనను శాహిస్తేఖాను డత్యంతవిషాదహృదయుం డయ్యె. యశవంతసింగుని యొక్క పరాకువలన నింత పుట్టెనని యాతని నిందింపసాగె. 'సైన్యములో నైక్యభావము నాజ్ఞాధారకత్వము లేదు; యశవంతసింగు శివాజీకి వశుడయియున్నాడు.' అని ఔరంగజేబునకు వ్రాసి పంపెను. ఔరంగజేబు అప్పుడు గోవల్పురుగ్ఘతనుండి లేచి స్థానాంతరము చేయవలయు ననెడు యుద్దేశముతో గాశ్మీరమునకు వెళ్ళుటకు సిద్ధముగా నుండెను. ఇంతలో దక్షిణము నుండి యీవార్తపోగానే యాతడు శాహిస్తేఖానునిమాటలు నమ్మక యాతడే చేతగానివాడని తలచి యాతని బంగాళా సుబేదారుగా మార్చి యాతనికి బదులుగా దనపుత్రుడైన సుల్తాన్ మోఆజీమ్ అనువాని దక్షిణమునకు సుబేదారుగా బంపెను. శాహిస్తేఖానుడు వెడలిపోయినతరువాత యశవంతసింగు సైన్యములను దీసికొని ఔరంగబాదులో విడిసి యుండెను.

ఇట్లు శివాజీ కల్యాణపట్టణమునొద్ద నొకటియు ధుండీ రాజపురమునొద్ద నొకటియు, నిట్లురెండు ప్రచండసైన్యముల బోగుచేసెను. ఒకసైన్యముతో పోర్చుగీజ్ వారి వసయీపైని దండెత్తెద ననియు, రెండవసైన్యముతో జింజరాసిద్దీని సాధించెద ననియు వదంతులు శివాజీ శత్రువులను మోసపుచ్చుటకునై ప్రచురింప జేసెను, కాని గుజరాతు దేశములోని పట్టణములలో నత్యంతధనముగలది యైన సురత్ (Surat) పట్టణముపై దండెత్తి పోవుట శివాజీయొక్క రహస్యోద్దేశమై యుండెను.

బహిర్ జీ నాయక్ అనువాని ముందు బంపి యాపట్టణము కొల్లగొట్టు నుపాయంబు లన్నియు బూర్తిగా విచారించి యుంచెను. కావలసిన సిద్ధత యంతయు నైన పిదప నాసిక పట్టణమునకు దేవదర్శనార్థమనియు, పేష్వాయైన మోరోపంతు పింగళేగారు అచ్చటనై పుల(?)గ్రోత్తగా సంపాదించిన సర్గములను జూడవలయుననియు మిషపెట్టుకొని శివాజి నాసికకుబోయెను. లోకులందరు శివాజీ నాసికక్షేత్రములో నున్నాడను కొనుచుండ నాతడు నకస్మాత్తు నాలుగువేల గుర్రములతో సూరతు పట్టణముపై బడెను. ఆరురోజులవరకు నా పట్టణము యథేష్టముగా గొల్లగొట్టి శివాజి అచ్చటి సుబేదారునకు వర్తమాన మంపి యాతడు వచ్చువరకే యక్కడ సంపాదించిన యపార ధనమంతయు రాయగడము చేర్చెను ఈ తడవ శివాజీకి గోట్లకొలది ధనము దొరకినది యని చరిత్రకారులు వ్రాసి యున్నారు, ఆ కాలమున సూరతు పట్టణములో డచ్ వారి యొక్కయు, ఇంగ్లీషువారియొక్కయు దుకాణము లుండెను. కాని శివాజీ వానిజోలికి బోయినవాడు కాడు. (శివజాన్యువరి ౧౬౬౪

సూరతు పట్టణమునుండి తిరిగి వచ్చినతోడనే శివాజీ తనతండ్రియైన శహాజీయొక్క మృత్యువార్త వినెను. శహాజీ వేటాడునప్పుడు గుర్రముమీదినుండి పడి బసవపట్టణములో మృతుడయ్యెను. తండ్రిమరణమునకు దుఃఖించి లక్షలకొలది ధనము ఖర్చుచేసి యాతనియు త్తరక్రియలు మహావైభవముతో సింహగడములో జేసెను. శహాజీ మరణానంతరము శివాజీ

'రాజా' యనుబిరుదు తాను గైకొనెను. తనపేరిట నాణెములు పోయసాగెను.

క్రిందటి రెండు సంవత్సరములవలె నీ సంవత్సరమును నేతాజి పాల్కరుడు వర్షాకాలమునకు పూర్వము మొగలుల రాజ్యము కాల్చ బేల్చ సాగెను గాని, వాని నెదుర్కొను వారు మొగలులలో నెవ్వరు లేరైరి. అటు సముద్రము మీదను మరాటావారిశౌర్యం బసహ్యం బయ్యె. మక్కాయాత్రకు బోవు ననేక తురుష్కులతో నిండియున్న మొగలుల యోడలన్నియు బట్టుకొని నా యాత్రికులయొద్దనుండి యప్పనంబులు తీసికొని గాని, వారిని మరాటావారు విడువరైరి. ఆగష్టు (౧౬౬౮) నెలలో శివాజీ స్వయముగా దాడిమిపోయి అహమ్మదునగరమును దోచుకొని ఔరంగబాదువరకు దేశము నంతను జీకాకుపరచెను. శివాజీ మొగలులతో బోరాడుచున్నందున దాము బోగొట్టుకొనిన కొంకణప్రాంతము మరల సంపాదించుకొనుట కదియే మంచి సమయమని తలంచి చేసిన సంధికి విరుద్ధముగా విజాపూరు నవాబు కొంకణముపైకి సైన్యముల బంపెను. గాని శివాజీ సవ్యసాచిత్వమును వహించి యెచ్చట జూచినను దానయై యుద్ధమున శత్రువులను జర్జరితుల జేసెను. శివాజీ యనువాఁ డొకడా, లేక పదిమందా! యని శత్రువులకు భయముకలుగునట్టుల బ్రవర్తించె. యెవరికిదెలియకుండ నొక్కసారి కొంకణమునకు వచ్చి విజాపూరుసైన్యముల నెదిరించి వాని నోడించెను. ఆయుద్ధమున నారువేల సైనికులు నిహతులైరి. ఆ యుద్ధసమయమున వేంగుర్లె యను గ్రామ నివా

సులు శివాజీని నెదిరించినందున నాతం డాగ్రామమును గాల్చి వేసెను. ఇంతపని చేసి వెంటనే యాశూరుండు సింహగడము నకు మొగలుల నెదిరించుటకునై వచ్చెను గాని, ఇప్పుడు మొగలులు తమరాజ్యములోనేయుండి యగ్రేసరులై యుద్ధము నకు రాకపోయిరి.

ఇట్లు మొగలులు ప్రస్తుతము నిద్రించియున్నారని చూచి శివాజీ కొంత సైన్యము విజాపూరువారి రాజ్యములోనికి బంపి కొంతభాగము కొల్లగొట్టించుచు, తానుస్వయముగా మొగ లుల సైన్యముపై సర్వాస్త్రములు పడెద ననిన వదంతి యొకటి పుట్టించి యెవ్వరికి సంశయములేకుండ సముద్రములో బడవల నన్నింటిని బాగుచేసుకొని సముద్రప్రయాణము చేసి యొక్క సారి బసనూర్ (బారసిలోర) పట్టణముపై బడెను. సురత్ పట్టణమువలెనే యాపట్టణమును కొల్లగొట్టి యసంఖ్యాధనము సంపాదించి శివాజీ గోకర్ణమునకు బోయెను. అక్కడ గొంత దానధర్మముచేసి చుట్టుపట్లనున్న గొప్పపట్టణముల గొల్ల గొట్టెను. కార్వార్ పట్టణమువారు శివాజీని నెదిరించిరి; కాని తుదకు వారును కప్పమియ్యవలసినవారైరి. ఆపట్టణములో ఇంగ్లీషువారి దుకాణముండెను. వారు శివాజీకి వేయిరూపాయి లప్పన మిచ్చిరి. (౧౬౬౫గిఫిబ్రేవరి) అక్కడినుండి భూమార్గమున సైన్యమునుబంపి తాను జలమార్గమున రాయగడమునకు బయలుదేరెను. కాని యెదురుగాలియైనందున నోడలు మరల గ్రిందికివచ్చి యాయాసపడి కొంతనష్టము బొందెను. సముద్ర ప్రయాణమువలన లాభములేదని తలచి యాతరువాత శివాజీ

యెన్నడును స్వయముగా సముద్రప్రయాణము చేసినవాడు కాడు.

శివాజీ సముద్రయానమునకు బోయినప్పుడు ఔరంగజేబు యసవంతసింగును, తన కుమారుడయిన సుల్తాన్ మొఆజిమ్ అను వానిని (వీరిద్దరును దక్షిణములోని సైన్యాధిపతులు) తనయొద్దకు బిలిపించుకొని వారికి బదులుగా జయపూరురాజయిన జయసింగును దిలేర్ ఖాన్ పఠాన్ అను తురుష్కుని దక్షిణమునకు శివాజీపైకి బంపెను.

రాజాజయసింగును, దిలేర్ ఖానును నర్మదానది దాటి శివాజీ సముద్ర ప్రవాసములో నున్నప్పుడు తమ సైన్యములతో దక్షిణమునకు వచ్చి చేరిరి. జయసింగు ఏప్రిల్ నెలలో పూనా పట్టణములో విడిసెను. అతడెంతమాత్రమును నాలస్యము చేయక వెంటనే పురందరదుర్గమును ముట్టడించి యాముట్టడి పనిని దిలేర్ ఖానుని కప్పజెప్పి తాను స్వయముగా సింహగడమును ముట్టడించి విడిసెను; కొంత సైన్యమును రాయగడము వైపునకును బంపెను. శివాజీ నేతాజీపాల్కరుని రాజ్యములో నుంచిపోయెను; గాని, వాడు శత్రువులతో బోరాడక యితదేశములు కొల్లగొట్టుటకై పోయెను. కడతాజీ యను గుర్రపురౌతుల యధిపతి యొక్కడుండెను గాని, మొగలుల ప్రచండసైన్యము నెదుర్కొనునంతబలంబు వాని యొద్ద లేదయ్యె. కాన మొగలులు సైన్యము లక్ష్యములేక మరాటా వారి కోటలను నుద్దండతతో నాక్రమింప జొచ్చెను.

ఇట్లు పరసైన్యము లన్నియు దనరాజ్యములో విచ్చల విడిగా దిరుగుచున్న సమయమున శివాజీ సముద్రయానమున నుండి తిరిగివచ్చెను. వెంటనే రాయగడమునకు బోయి తన సరదార్లందరను బిలిపించి పెద్దసభ చేసి మొగలుల నెదు ర్కొనుమార్గంబెయ్యది యని యాలోచింపదొడగిరి. కాని శత్రుసైన్యమమిత మైనందునను, జయసింగుఅసమానపరాక్రమ వంతుడైనందునను, నాతని నెదిరించు నుపాయంబేమియు నెవ్వ రికి దోపదయ్యె. ఆలోచన లనేకములు చేసిరి; కాని యొక్క టియు గొనసాగుమార్గము లేకపోయెను. అప్పుడు సమయ జ్ఞుడైన శివాజీ జయసింగునితో యుద్ధముచేసిన లాభము లేదని తెలిసికొని సంధిచేయుటయే హితమని నిశ్చయించెను.

పురందరుదుర్గమును ముట్టడించిన దిలేర్ ఖాన్ అవి శ్రాంతముగా దుర్గమును స్వాధీనపరచుకొను ప్రయత్నంబు చేయుచుండెను. కాని, వీని ప్రయత్నబు లన్నియు దుర్గాధిపతి యగు మురార్ బాజీదేశపాండే యనువాడు నిష్ఫలముచేయు చుండెను. మొగలు లేదిక్కునుండి పైనెక్క ప్రయత్నించి నను, నాదిక్కునుండివారిపై బాణపరంపరలు గురిపించి వారిని వెడలగొట్టుచుండెను. ఆదుర్గములోనున్న రెండువేలవీరులు శత్రువులతో ఘోరముగా బోరుచుండిరి. తుదకు దిలేర్ ఖాన్ కొందరు మారాటా వీరులను వెనుకకు నెట్టి దుర్గము యొక్క యొకబురుజుక్రింది సొరంగముచేయ జొచ్చెను. మరాట వీరులు పెట్టుబాధ కెట్టులైన నోర్చుకొని యాసొరంగము పూర్తి చేసి యందు మందునింపి నిప్పుముట్టించి కొంతభాగము కూల్చి

మొగలుల సైన్యములు లోపలికి చొరబడెను. చొరబడు సమయమున మొగలులు కొంత తొందరపాటుపడి యవ్యవస్థితులయినందున, నిదియే సమయమని తలచి మరాటావీరులు పైనుండి ఫిరంగిదెబ్బలతో శత్రువులను జెదరగొట్టిరి. వాండ్రు పారిపోవునప్పుడు వారి వెంటదగిలి దుర్గాధిశుడు రెండువేల మొగలు సైనికుల నరకెను. కడమ సైనికులందరు బారిపోయిరి. దిలేర్ ఖానుడు ఏనుగుమీద కూర్చుండి యుద్ధమంతయు జూచుచుండెను. తన సైనికులు బారిపోవుట చూచి వారి నందర మరల బోగుచేసికొని పంబిన కోపముతో దుర్గాధిపతి యైన మురార్ బాజీ పోరాడుచున్న చోటికి బోయెను. గాని మరాటా (మావళా) వీరులు విజృంభించి పోరాడునప్పుడెట్టి శత్రువులనైన లక్ష్యపెట్టువారు కారు. ఇట్లుభయ సైన్యములు ఘోరముగాబోరుచుండ దిలేర్ ఖానుడు సూటిగా బాణమువేసి దుర్గాధిపుడైన మురార్ బాజీని పడవైచెను. తమ నాయకుడు పడుట చూచి మావళేవీరులు భీతిజెంది, పై కోటమీదికి బోయిరి. మొగలులు మరల గ్రిందిబురుజును నాక్రమించుకొనిరి. కాని పైనుండి వచ్చు ఫిరంగిగుండుల కోర్వలేక యా బురుజును గూడ వారు మరల విడువ వలసినవారైరి.

ఇట్లు పురందరు దుర్గము ఉత్తరదిక్కునుండి సాధించుట యసాధ్యమని తలచి, దిలేర్ ఖానుడు పురందరమునకు నీశాన్యమున నున్న వజీర్ గడమను కోటను ముట్టడించి సాధించెను. కోటమీద ఫిరంగులుంచి యక్కడినుండి పురందరముయొక్క పై కోటమీద గుండ్లు వేయుజొచ్చెను. కాని యప్పుడు వర్షా

కాలము వచ్చినందునను, మొగలులయొద్ద యుద్ధసామగ్రి పూర్తిగా లేనందునను, ఆ గుండ్లవలన పురందరు కోటలోని వారి కేమియు హాని కలిగినదికాదు. అయినను పురందరులోని వీరులందరు హతాశులైనందున, పోరాడినందున లాభములేదని తలచి వారు దుర్గమే శత్రుస్వాధీనముచేయుటకు సిద్ధపడిరి. కాని, తాను వర్తమాన మంపువరకును దుర్గము వదలవలదని శివాజీ యాజ్ఞాపించినందున ఆయాజ్ఞకు లోబడవలసిన వారైరి.

ఇక బురందరుకోట శత్రువుల చేతిలో బడకుండ నుండనేరదు. అది శత్రువులచేత జిక్కినేని కడమ దుర్గము లన్నియు సులభముగా జిక్కును. ఇక మొగలులతో ద్వారగా సంధిచేయుటయే మేలు. కోటలన్నియు శత్రువుల చేతిలో జిక్కినతరువాత సంధికి నొడబడుట మేలుకాదు అని తలచి, శివాజీ సంధిమాటలు మాటలాడుటకై జయసింగు నొద్దకు రఘునాథభట్ పండితరావ్ అనువాని బంపెను. జయసింగు డా రాయబారిని మిగుల గౌరవించి యాతడు చెప్పు మాటలన్నియు శ్రద్ధతో వినెను. శివాజీ మనలను మోసపుచ్చ వలయునని యీ యుక్తి చేసెనేమో యని మొట్టమొదట జయసింగుడు తలంచెను గాని, రాయబారి ప్రమాణపూర్వక ముగా సజస్థితి దెలిపిన తరువాత జయసింగుడు సంధికి నిష్టపడి శివాజీకి నిట్లు వర్తమాన మంపెను. 'ఔరంగజేబు బాదుషహా' సార్వభౌముడు ; బలవంతుడు ; అతనితో సఖ్యము చేయుట నీకు మంచిది; ఆతనితో గలహించి నీవు బ్రతుక నేరవు. నేను హిందూరాజును ; నీవును గొప్పవంశములోని

వాడవు. నీవు హిందూమత సంస్థాపన చేయుచున్నా వది నాకు సమ్మతమే. నీవు ఢిల్లీశ్వరుని శరణుజొచ్చిన నాతఁడు నిన్ను క్షమించు నట్లును, నీకు గొంత జాగీరు ఇచ్చునట్లును నేను చేయగలను' ఇట్లు శివాజీకి రాయబారివలన జయసింగు మనోభీష్టము తెలియఁగా, నాతఁడు జయసింగును జూచి స్వయముగా మాటలాడుటకు సింహగడమునొద్దకు వచ్చెను. జయసింగుఁడు స్వయముగా శివాజీకి నెదురుగాబోయి యాతనిని సాగనంపుకొని గౌరవించి తనకు కుడిప్రక్కను గూర్చుండ బెట్టుకొని మిక్కిలి ప్రేమతో సంధిమాటలు ముచ్చటించెను. తరువాత శివాజీవెంట దన మేనమామ యైన సుభానసింగును నిచ్చి పురందరులో నున్న దిలేరుఖానుని యొద్దకు బంపెను. ఆ ఖానుడును శివాజీవేడిన సంధికి నొప్పుకొనెను'. వారందరు గూడి సింహగడమునకు దిరిగి వచ్చిరి. ఇట్లు కొన్ని రోజు లాలోచనలు జరిగి తుదకు రాజా జయసింగు ఔరంగజేబున కు తరము వ్రాసి, తనకును శివాజీకిని జరిగిన యొడంబడిక లాత నికి దెలుపవలయు ననియు, ఆతని యొద్దనుండి జవాబు వచ్చిన తరువాత సంధి స్థిరపరుప బడు ననియు నిర్ణయించిరి. ఆ యొడంబడిక లెవ్వియన:—"ఢిల్లీశ్వరుని రాజ్యములోనివియై శివాజీచే నాక్రమింప బడినవియు, నాతనిచే నూతనముగా నిర్మింపబడి నవియు నయిన ముప్పదిరెండు దుర్గములలో పురందరు, సింహగడము, మరి పదునెనిమిది దుర్గములు గలసి ౨౦ దుర్గములను, వాని చుట్టుపట్టుల నున్న ప్రదేశమును శివాజీ జయసింగునకు స్వాధీన పరుప వలయును. కడమ పండ్రెండు దుర్గములును,

వానిచుట్టు నున్న లక్ష హోనుల ప్రాంతమును, యిదివరకు నాతను ప్రభుత్వము చేయుచున్న యితర ప్రాంతమును, శివాజీ తనకొరకై యుంచుకొని, యది బాదుషాహావలన నియ్యబడిన జాగీరుగా నెంచవలసినది. శివాజీ కుమారుడైన యెనిమిదియేండ్ల సంభాజికి బాదుషాహావలన నైదువేల గుర్రపుసవార్ల మనసబు దొరకవలయును. ప్రస్తుతము శివాజీ బాదుషాకు కిచ్చుచున్న దుర్గములకు మారుగాను, యిదివరకాతనికి అహమ్మదునగరము రాజ్యములో నున్న దేశముఖు హక్కులకుగాను, విజాపూరు రాజ్యములో చౌథ్ (నాలుగవవంతు; సర్ దేశ్ ముఖు హక్కులు బాదుషా శివాజీ కియ్యవలెను. ఈ హక్కుల క్రింద వచ్చుధనము స్వయముగా శివాజీ వసూలు చేసికొనవచ్చును. ఈ హక్కు-లిచ్చినందులకు ఔరంగజేబుకు శివాజీ పేష్కషు క్రింద ౪౦ లక్షల హోనులు, సంవత్సరమునకు మూడులక్షల చొప్పున చెల్లింపవలయును. పని పడ్డప్పుడు సైన్యముల బంపి బాదుషహాకు సాయము చేయవలయును."

పైని వర్ణింపబడిన యొడంబడికలన్నియు నొప్పుకొని ఔరంగజేబు శివాజీ కొక పెద్దయుత్తరము పంపెను. అందుపై వీరికిని వారికిని స్నేహభావము కుదిరి సంధియయ్యెను. అంతట జయసింగు, విజాపూరునవాబు ఢిల్లీశ్వరుని ధిక్కరించి కరభారమియ్యనందున నాతనిపైకి దండెత్తివెడలెను. ఈయుద్ధమునందు శివాజీ రెండువేల యశ్వబలముతోను, ఎనిమిదివేల కాల్బలముతోను, జయసింగునకి సాయము చేయుచుండెను. మరాటా వారిసాయమువలన జయసింగు డనేక గ్రామములను సాధించెను.



★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★

## తొమ్మిదవ ప్రకరణము

★

## ఢిల్లీ ప్రయాణము

విజాపూరువారితో బోరాడునప్పుడు తన సైన్యములకు శివాజీ సహాయము చేసినాడనియు, దనకొరకు ననేక దుర్గముల సాధించినాడనియు విని ఔరంగజేబు సంతసించి, తన సంతోషమును వెల్లడిచేయుటకై ప్రశంసించుచు శివాజీ కొకయుత్తరము వ్రాసి యాతనితో గొన్ని కానుకలును బంపెను. తరువాత గొన్నిరోజులకు మరియొక జాబు పంపి యందు "నీవకసారి ఢిల్లీకివచ్చి మమ్ములనుజూచి పోవలసినది. నీవిక్కడికి వచ్చినయెడల నిన్ను గొప్పసరదారునుగ జేసి గొప్పరాజకీయ కార్యములపై నియుక్తుని జేసెదము -" అని వ్రాసెను.- ఈయుత్తరము శివాజీ జయసింగునకు జూపి యాతనియభిప్రాయ మడుగగా వెళ్ళవలసినదియే నని యాతడు సలహాచెప్పెను. అందుపై దానురాగలనని బాదుషాకు జెప్పుటకై తన వకీలగు రఘునాధబల్లాళకొండే యనువాని ముందుగా ఢిల్లీకి బంపెను. ఆతడు ఢిల్లీకిబోయి, అక్కడి రాజకీయస్థితి యంతయు అచ్చట సరదార్ల ప్రవర్తనము, మొదలయిన సంగతులన్నియు రహస్యముగా గనుగొని తనకు దెలియజేయవలయు నని యేర్పాటుచేసెను. తాను ఢిల్లీకి బోయినప్పుడు తన రాజ్యము

యొక్క పరిపాలన చక్కగా జరగవలయునని రాజ్యతంత్రము లన్నియు మోరోపంతుపింగళే 'ఆబాజిసోనదేవుడు, అణ్ణాజీదత్తో అను ముగ్గురు సరదారుల చేతికిచ్చి, వారియాజ్ఞను దన యాజ్ఞగా జూచుచుండవలయునని యందరు సేవకులకు నాజ్ఞాపించెను. బయలుదేరుటకు బూర్వము శివాజీ స్వయముగా దన దుర్గముల నన్నింటిని బరీక్షించి చూచెను.

తనవెంట నైదునూర్గు రశ్వసైనికులను, వేయిమంది మావళేవీరులను దీసికొని తన కుమారుడయిన సంభాజీతో గూడ శివాజీ క్రీ. శ. ౧౬౬౬వ సంవత్సరపు మార్చినెలలో ఢిల్లీకి బయలుదేరెను. నర్మదానది దాటి మధురా బృందావన క్షేత్రములను దర్శించి వారందరు ఢిల్లీ చేరిరి. జయసింగు కుమారుడగు రామసింగును, మరికొందరు చిన్నసరదార్లుతప్ప నెవరును శివాజీకి నెదురుగా వచ్చినవారు కారు. ఉత్తరములు వ్రాసి నన్ను బిలిపించి గొప్పవారినెవరిని నాకు నెదురుగా బంపక పోయెనని శివాజీకి గొంత మనస్తాపముగలిగెను. తరువాత బేరోలగమున ఔరంగజేబును జూడబోయినప్పుడును దగిన సన్మానంబు జరగదయ్యె. ఔరంగజేబు నిండిన సభలో గొలువుండగా శివాజీ వెళ్లి జోహారుచేసి తాను దెచ్చిన కానుక లొసంగగా 'ఎప్పుడువచ్చితి' రని యడిగి తన కుడివైపున నిలువబడి యున్న రాజపుత్రులలో నిలువబడుమని కనుసంజ్ఞ చేసెను. ఢిల్లీశ్వరుడు తన్ను గొప్పసరదార్లలో గూర్చుండబెట్టి గౌరవించునని తలచి వెళ్ళినశివాజీ యటులగాక తన్ను నిలువబెట్టినందులకు నెంతయు గోపించి ఔరంగజేబు మనస్సునకు

దగులునట్టి మాటలు కొన్ని యనెను. తరువాత శివాజీ తాను దిగిన బసకు బోగా, రేపటినుండి నీవు పేరోలగమునకు రానక్కరలేదు. ఏమి మాటలాడవలసియున్నను రాయబారి ద్వారా మాటలాడవచ్చును. అని ఔరంగజేబు శివాజీకివార్త పంపెను. అందుపై శివాజీ తాను ఢిల్లీకివచ్చి మోసపోయితి నని తెలిసికొని యికముందు బాదుషా యేమి చేయదలచి నాడో తెలిసికొనుటకై యాతనియొద్దకు దన వకీలును బంపి 'మీరు రమ్మని జాబు లంపినందున మేమిక్కడికి వచ్చినారము మేము మాచేతనైనంత మీసేవ చేసినారము. అందులకు మీరు చౌథ్ (నాలుగవభాగము) సర్దేశముఖ్ హక్కులనుగురించి మాకు సనదులీయ వలసినది. దక్షిణమునందలి గోలకొండ విజాపూరు రాజ్యమును సాధించుటకు మేము మేమెంతయైనా సాహాయ్యము చేయగలవారము. అయినను ఆ సాహాయ్యము మీకక్కరలేని యెడల మాదేశమునకు బోవుటకు మాకు సెలవిప్పింప వలసినది. ఇచ్చటనీళ్ళు మాకును మాపరిజనంబులకును గిట్టవు గాన మాకు వెళ్ళుటకు సెలవిప్పింప వలసినది' అని విన్నవించుకొనెను. అందులకు దగిన ప్రత్యుత్తరం బియ్యక ఔరంగజేబు ఊరికొత్వాలగు పౌలాద్ ఖానుని బిలిచి 'శివాజీ దిగిన బసకుజుట్టును పహరాలుంచి, ఆత డెక్కడికి వెళ్ళినను నాతనివెంట మన బంట్రౌతుల నుంచుచు నాత డెక్కడికిని బారిపోకుండ జూచుచుండవలయు' నని యాజ్ఞాపించెను. ఇట్లు తన్ను కైదుచేసినందున దన్ను నౌరంగజేబు ఏవేళ నేమిచేయునో యని చింతించుచు నామహాసంకటములో

నుండి బయట బడుటకు నుపాయంబు యోజించుచుండెను. కొన్ని రోజులయిన తరువాత మాదేశమునకు బోవుటకు నాకు సెలవిచ్చుటకు వీలులేదేని మా సైనికులకైనను సెలవిప్పించునది. ఇక్కడి నీరు పడక వాండ్రలో ననేకులు రోగగ్రస్తులైయున్నారు' అని శివాజీ రామసింగుద్వారా ఔరంగజేబుతో విన్నవించెను. సైన్యము లన్నియు వెడలిపోయిన తరువాత శివాజీయొక్కడే తనచేత జిక్కునని యాశచే స్వదేశమునకు వెళ్లుటకు శివాజీ సైన్యములన్నింటికి ఔరంగజేబు ఆజ్ఞ ఇచ్చెను. వెంటనే శివాజీ సైన్యములన్నింటిని నింటికిబంపి యత్యంత విశ్వాసపాత్రులయిన కొలది సేవకులను మాత్రము తనయొద్ద నుంచుకొనెను. ఇట్లు సైన్యములన్నింటిని బంపి తాముకొలది మందియున్నందున నక్కడనుండి యెట్లయినను దప్పించుకొని పోగలనని ధైర్యము శివాజీకి గలిగెను.

చెరలోనుండి తప్పించుకుని పోవుటకు శివాజీ పన్నిన యుక్తి యత్యద్భుతంబు. అందువలన నతనికల్పనాకౌశలంబును, నద్భుతసాహసంబును వ్యక్తమగును. ఢిల్లీపట్టణములో నున్న సామంతరాజులయొక్కయు, సరదారులయొక్కయు, గొప్ప రాజకీయోద్యోగములలో నున్నవారియొక్కయు స్నేహభావములు శివాజీ క్రొత్తగా సంపాదించుకొనుచుండెను. వారి యందరయింటికి ఫలాదులును మిఠాయి మొదలయిన ద్రవ్యములును బుట్టలలోనింపి బహుమతిగా బంపుచుండెను. ఆ బుట్టలలో నేమి యుండునో యని మొట్టమొదట పహారామీఁది సంరక్షకభటులు లాబుట్టలను విప్పించి చూచుచుండిరి. కాని

యట్టి బుట్టలు రోజు ననేకము వచ్చుచు బోవుచు నున్నందున భటులు నిశ్శంకులై పరీక్షింపకయె బుట్టలను బోనిచ్చు చుండిరి. అంతట శివాజీ తనయొద్ద నున్న విశ్వాసపాత్రు లగు సేవకుల నందరను నొక్కొక నెపముచే దనయొద్దనుండి వెడల గొట్టెను. వారు మారువేసములు వేసికొని యీ పట్టణము లోనే శివాజీరాకకు నెదురుచూచు చుండిరి. ఇంత సిద్ధతయైన పిదప దనకు శరీరము నెమ్మదిగా లేదని నటించుచు కొన్ని రోజులు శివాజీ యిల్లు వెడలకుండెను. ఒక్కరోజు సాయం కాలము శివాజీయు, సంభాజియు నొక్కొక బుట్టలో గూర్చుండి మిఠాయి బుట్టలను నెపమున పహరాలోనుండి తప్పించుకొని పోయిరి.

తాము వెళ్ళినతోడనే యీ సంగతి యచ్చటి భటులకు దెలిసినయెడల భటులు తమ్ము వెంబడింతు రని తలచి యటుల గాక పారిపోవుటకు దమకు వీలు చిక్కవలయునని శిబిరము వెడలునపుడు శివాజీ యొకయుక్తి పన్ని పోయెను. తాను శయనించు మంచముపై దనయొద్ద నున్న యొక సేవకుని బరుండబెట్టి తాను గప్పుకొను శాలువ యాతనికి గప్పి యొక కుర్రవానిని వానికి పాదములొత్తుచుండునటుల నియమించెను. శివాజీ పారిపోయిన కొంతకాలమునకు నొక సంరక్షకభటుడు వచ్చి శివాజీకి నేడు శరీర మెట్లున్నది యని యడుగగా నాకుర్రవాడు 'నేడు యజమానులవారికి శిరోబాధ యత్యధికముగా నున్నది గాన మీ రెవ్వరును నిక్కడికి వచ్చి బాధ పెట్టవలదు' అని చెప్పెను. అందుపై ఆ రాత్రి యంతయు

నచ్చటి కెవ్వరు వచ్చినవారు కారు. తెల్లవారిన తరువాత నాసేవకుడు యజమానునికి మందు తెచ్చెద ననియు, నాకుఱ్ఱవాడు మరియొక నెపముననుు వెలువడిరి. ఇట్లు శివాజీ కొంత తనచాతుర్యమువలనను, కొంత మోగలుల తెలివితక్కువ వలనను ఔరంగజేబు వలలోనుండి తప్పించుకొనెను.

రెండవరోజు రెండుజాములవరకును వేచి యుండి శిబిరములో నెవ్వరున్నజాడ కానక, బటులు శిబిరములోనికి జొచ్చి చూడగా శివాజీ తమ్ము మోసపుచ్చి పారిపోయినా డని వారికిదెలిసెను. ఆ వార్త వారు కొత్వాలునకు దెలుపగా వాడు భయపడుచు నాసంగతి బాదుషహాతో జెప్పెను. అందుపై నాతడు కొత్వాలునిపై మిగుల గోపించి యాతని మనసబుతీసివేసి శివాజీని వెదుకుటకయి గ్రామమునందంతటను చారులను బంపెను. కాని శివాజీ కానరానందున నాతని బట్టికొనుటకు దాలూకాదారుల కందరకు నుత్తర్వులంపెను.

శివాజీ ఢిల్లీనుండి వెలువడినతరువాత బైరాగివేషము వేసికొని వచ్చినత్రోవనే మరల తనదేశమునకుం బోయిన యెడల బాదుషహాయొక్క మనుష్యులు తన్ను పట్టుకొని యెదరేమో యని తలచి కాశి, గయ, ప్రయాగ మొదలయిన క్షేత్రములమీదినుండి వెళ్ళ నిశ్చయించెను. మొట్టమొదట మధురాపట్టణమునకు బోయి చిన్నవాడైన తనకుమారుడు తనవెంట నిడుమల పడజాల డని యచ్చట మోరోపంతు పింగళేయొక్క బావమరది నుండగా, నాతనియొద్ద సంభాజి నుంచి, తీర్థయాత్రలు సేవించుకొనుచు నెవ్వరిచేత బడకుండ

బయలుదేరిన తొమ్మిదినెలలకు శివాజీ రాయగడకోట జేరెను. (౧౬౬౬; డిసెంబరు) సురక్షితముగా జేరినందులకు శివాజీ గొప్పయుత్సవము చేసెను; శర్కర పంచిపెట్టిరి; ఫిరంగులు కాల్చిరి. తాను జేరిన తరువాత మనుష్యులను బంపి శివాజీ తన కుమారుని బిలిపించుకొనెను.

శివాజీ ఢిల్లీకి బోయివచ్చునప్పటికి దక్షిణమున శివాజీకి ననుకూలము లయిన సంగతు లనేకము జరిగెను. శివాజీ వెళ్ళిన తరువాత జయసింగొక్కడే విజాపూరు నవాబుతో బోరాడుచుండెను. విజాపూరువారికి సహాయముగా గోలకొండ వారును సైన్యములు పంపిరి. వర్షములు తక్కువైనందున మొగలుల సైన్యమునకు జాలినంత నీరు లేకపోయెను. జయసింగునకు సహాయముచేయుటకు ఔరంగజేబు సైన్యము లేమియు బంపినవాడు కాడు. ఇందువలన శత్రువులు జయసింగును మిగుల బాధపెట్టసాగిరి. తాను హిందువు అయినందున దన సైన్యములన్నియు నశించిన ఔరంగజేబున కెంతమాత్ర మును జింత కలుగనేరదని తలచి, జయసింగు విజాపూరి వారితో బోరాటమాని అహమ్మదునగరము చేరెను. తాను ఢిల్లీశ్వరునికొరకై సాధించిన కోటల నన్నిటిని రక్షించునంత సైన్యము జయసింగునొద్ద లేనందున, నాతడు కొన్ని గొప్ప కోటలపై మాత్రము తన సైనికులనుంచి కడమ కోటల నన్నింటిని శత్రువులకు బనికిరాకుండ జెరచివేసెను. ఇంతలో శివాజీ ఢిల్లీనుండి పారిపోగా జయసింగు కుమారుడైన రామసింగు సాహాయ్యమువలన నాతడు పారిపోయినాడని

సంశయించి ఔరంగజేబు రామసింగును రాజసభకు రావలదని నియమించి, ఆతనితండ్రియైన జయసింగును దక్షిణము సుబేదారినుండి తొలగించి మరల దనకుమారుడైన మొఅజిమ్ అను వానిని, యశవంతసింగును దక్షిణమునకు బంపెను. తన యోగ్యత ఔరంగజేబు కనుగొనకపోయెనే యనిన చింతచేత జయసింగు ఉత్తరహిందూదేశమునకు బోవుచు త్రోవలో మృతిజెందెను. జయసింగు మృతిజెందినపిదప దిలేర్ ఖానుని గూడ ఔరంగజేబు దక్షిణమునుండి మార్చి మాళవాకు బంపెను. (౧౬౬౭)

ఇట్లు ఘనతవహించిన యిద్దరు సేనాధిపతుల బనినుండి తొలగించి ఔరంగజేబు వారి స్థానమందిద్దరు సామాన్యులయిన సరదారుల నియమించినందున శివాజీకి లాభమయ్యెను. ఇప్పుడు వచ్చిన యశవంతసింగు జోధపురపురాజు. ఈతడు వయస్సునందు కొంత పెద్దవాడును, సంభావిత ప్రవర్తనగల వాడును అయియుండెను. శివాజీ ఢిల్లీలో నున్నప్పుడీతనితో స్నేహము చేసి యితని లోభస్వభావమును గనుగొని యుండెను. ఈరాజు హిందూధర్మమునం దత్యంతాభిమానము గలవాడై జిజియాయను హిందువులపైనున్న పన్నును గురించి యొక పెద్ద యుత్తరము ఔరంగజేబునకు వ్రాసియుండెను. ఈయుత్తరము శివాజీ ప్రేరణచేతనే వ్రాసెనని కొందరు చెప్పెదరు. ప్రస్తుతము దక్షిణమునకు సుబేదారుగావచ్చిన సుల్తాన్ మొఅజిమ్ అనువాడు ఔరంగజేబునకు రెండవకుమారుడు. సుస్వభావముగలవాడు. ఆతడు శౌర్యౌదార్యములను గురించి

విశేషవిఖ్యాతిజెందె. తండ్రివలె నెవ్వరిని నమ్మకయుండువాడు కాడు. కాని వానియందు విలాసలోలుపత, అమితవ్యయము, పరీక్షింపక యందరను నమ్ముట, అను మూడు దుర్గుణంబులుండెను.

వీరిరువురు వచ్చుటకు బూర్వమే మోరోపంతుపింగళే జయసింగుచే విడువబడిన కోటలన్నింటిని నాక్రమించి, మరల బాగుగా గట్టించి తన సైన్యములను వానియందుంచెను. శివాజీ ఢిల్లీనుండి వచ్చువరకే యీమంత్రిశిఖామణి కల్యాణప్రాంతమంతయు మొగలులయొద్దనుండిసాధించియుండెను. కాని క్రొత్తగావచ్చిన యిద్దరు సేనాధిపతుల స్వభావము శివాజీ యెరిగి యున్నందున ప్రస్తుతము పరాక్రమముకంటె ధనమువలననే యధికలాభ మగు నని నిశ్చయించెను. రాజపుత్రునకుఁ, యశవంతసింగునకును గావలసినంత ధనంబొసంగి వారిని శివాజీ వశపరచుకొనెను. శివాజీ 'మాకును బాదుషహాకును సంధి కుదుర్పవలసినది. బాదుషహా మావలన సేవ తీసికొనినవాడు కాడు. అయినను వారిసేవ చేయవలయునని మాకు నిచ్ఛ కలదు'యని రాజపుత్రునికొకయర్జీ పంపుకొనెను. ఆతండు తన యనుకూలాభిప్రాయముతో ఆ యర్జీ బాదుషహాయొద్దకు బంపగా, నాతనికి నుత్తరమున విశేషావశ్యకములైన పను లున్నందున నాతడు శివాజితో నిప్పుడు పోరుపెట్టుకొనుట మంచిదికాదని తలచి, యాతని విన్నపమును స్వీకరించి యాతనికి "రాజా" యనుబిరుదొసంగి పూనా, చాకణ్, సుపే మొదలైనప్రాంతము లాతనివి యాతనికిచ్చివేసెను. సంభాజీకి ౫౦౦౦ గుర్రపురౌతుల మన్సబుదారి ఇచ్చెను. అహమ్మదునగరురాజ్య

ములో శివాజీకి గల హక్కునకు మారుగా నాతనికి వర్హాడు (Berars) ప్రాంతము జాగీరుగా నిచ్చెను. పూర్వమొప్పుకొనినటుల విజాపూరురాజ్యములోని చౌథ్, దేశముఖిహక్కులును శివాజీకి నొసంగె. శివాజీ మనస్సులోనున్న కోపము పోవుటకై ఔరంగజేబు తన కుమారునిద్వారా శివాజీ కిట్లు వ్రాసి పంపెను. 'మిమ్మును చాల గౌరవించి మీ హక్కులను గురించి మీకు సనదులు వ్రాసియిచ్చి, మహాకార్యబులు చేయ మిమ్ము నియమించి, మీకు శలవియ్యవలయునని మేము తలచియుంటిమిగాని, మీరు మాకు జెప్పకయే వెడలిపోయితిరి. ఐనను జింత లేదు. ఇద్దరము స్నేహభావముతో నుండవచ్చును.'

మొగలులకును విజాపురమువారికిని జరుగుచున్న యుద్ధమువలనఉభయులకును నెంతమాత్రము లాభము లేనందున వారిద్దరును విసవి ౧౬౬౮ సంవత్సరములో సంధిచేసికొనిరి. వీరికి దోడై తన్ను ఆ రాజ్యములోని దనచౌథ్, సర్ దేశముఖి హక్కులను రాబట్టుకొననియ్యరేమోయని భయపడి, శివాజీ రాజపుత్రుని, యసవంతసంగును జూచి వారికి గొంతద్రవ్య మిచ్చి వారని వశపరచుకొని తనహక్కు వసూలుచేయుటకు విజాపూరు రాజ్యముపైకి దండెత్తిపోయెను. అందులకు విజాపూరువారు భయపడి శివాజీకి ప్రతిసంవత్సరము మూడు లక్షల రూపాయలిచ్చునటుల నొప్పుకొని యాతనితో సంధి చేసికొనిరి. విజాపూరు నవాబువలెనే గోలుకొండనవాబుగూడ శివాజీ తనరాజ్యముపైకి దండురాకుండుటకై యాతనికి సంవత్సరమునకు నైదులక్షలిచ్చునటుల నొప్పుకొనెను. (౧౬౬౮)

ధీనపరుచుకొనవలసినది. ఇట్లుచేయని యెడల నీవు మా నిగ్ర
మునకు పాత్రుడవయ్యెదవు'. సుల్తాన్ మొఆజిమ్ తండ్రి
యగు ఔరంగజేబునివలె మోసగాడు కానందున ఈయాజ్ఞ
యతనికి రుచించినదికాదు. ఢిల్లీలో జరుగు వృత్తాంతము
ల్నియు దెలుపు చారులు రాజపుత్రుని (మోఆజీమ్) యొద్ద
న్నందున పైనివర్ణించినయాజ్ఞ వచ్చి చేరకమునుపే యిట్టి
యుత్తరువులు వచ్చుచున్నవని యాతనికి దెలిసెను. సంధి
యమముల ననుసరించి తనకు సాయముచేయుటకై తన
యొద్దనున్న మహారాష్ట్ర సైన్యాధిపతుల రహస్యముగా బిలి
చి మోఆజిమ్ వారితో నిట్లని చెప్పెను. 'మిమ్ములను జెర
బట్టుమని బాదుషహాగారి యుత్తరువులు వచ్చుచున్నవి.
అవి రేపో మాపో వచ్చిచేరగలవు. ఉత్తరువులు వచ్చిన
తరువాత మేము మిమ్ము విడుచుటకు వీలులేదు. కాన నీలోగా
మీరు ఏదోయొకసాకు చెప్పి మీ మీ నిలయములకు
బొండు.' ఈవార్త వినగానే సర్ నోబత్, పండితరాయ యను
మరాఠావీరు లేవియో సాకులు కల్పించుకొని తమసైన్యము
లతో మోగలుల శిబిరములు వెడలిరి. వారు వెడలిన తరువాత
రెండుమూడు దినములకు ఢిల్లీనుండి యుత్తరువులు వచ్చెను.
రాగానే రాజపుత్రుడు తన సైన్యములతో మరాటావారిసైన్య
ముల వెంటబడి నట్టుల నటించె! గాని యింతలో వారు సుర
క్షితముగా పూనాపట్టణముచేరిరి.

క్రీ. శ. ౧౬౬౭ - ౧౬౬౯ ఈ రెండు సంవత్సరములు
శివాజీ యుద్ధము లేవియు జేయక యేవైపులను దాడి వెడలక

యున్నందున జను లందరు శివాజీయొక్క పరాక్రమమున కిదియే సీమయనియు, నిక మీద మోగలులతో బోరా డుట దుర్లభ మని తలచి శివాజీ తన పర్వతప్రదేశము వెడలి రాడనియు వింత వింతలుగా ననుకొనసాగిరి. కాని యీకల్పన లన్నియు నసత్యము లని చూపు ప్రసంగ మిప్పుడు వచ్చెను. ఇట్టి ప్రసంగము సంధిని పాటింపక మిత్రద్రోహము చేసిన ఔరంగజేబు వల్లనే కలిగినందున శివాజీ యొక్క * భవాని ఖడ్గము మిగుల ప్రకాశింపజొచ్చె.

శివాజియొక్క రాజ్యములోని సింహగడము, రాయ గడము అను రెండు ముఖ్యదుర్గములు జియసింగుడు జయించి నప్పటినుండియు మోగలుల స్వాధీనములోనే యుండెను. అందుచే చాకణ్ దుర్గమునుండి పూనాకు వచ్చునప్పుడు శివాజీకి మిక్కిలి యిబ్బంది కలుగుచుండెను. అందుచే వానిని సాధింపవలె నని యోచి శివాజీ యొకరోజు గొప్పసభ చేసి తన సరదార్లను నందరును బిలిపించి 'సింహగడ మెవ్వరు గెల్చెదరు?' అని యడుగగా తానాజీమాలసురే యనుశూరా గ్రేసరుడు 'నేను సింహగడమును సాధించెదను' అని ప్రతిజ్ఞ చేసెను. అప్పుడాతనికి తాంబూలవస్త్రాభరణంబులును వేయి మావళేభటులను నిచ్చి శివాజీ యుద్ధమునకు బంపెను. సిద్ధ మైన తన కుమారుని వివాహము మానుకొని యా తానాజీ యను నప్రతిమస్వామిభక్తుడు 'నేను బ్రతికివచ్చిన నేనే వివా హముచేయ గలను. నేను యుద్ధములో హతుడ నగుదు

* శివాజీచేతిలోని ఖడ్గమునకు 'భవాని' యని నామము.

నేని మీరే నాకొమారుని వివాహము చేయవలయును' అని శివాజీతో విన్నవించి మాఘబహుళనవమి (ఫిబ్రేవరి) రోజున బయలుదేరెను.

సింహగడ మతిభయంకర మైన పర్వతశిఖరముపైనున్న దుర్గము. దాని సాధించుట సాధారణముగా నసాధ్య మనియె చెప్పవచ్చును. పర్వతము గగనచుంబితముగా నత్యంతౌన్న త్యము కలదియై దాని పూర్వపశ్చిమదిక్కుల ప్రచండ మైన పురందరపర్వత మున్నది. దక్షిణోత్తరదిశలందు నరిమైలు ఉన్నతము గల శిలలు పెట్టిన నున్నటిగోడవలె నున్నవి. ఇది యెక్కి పైకి బోయిన నలుబదియంగుళములు ఎత్తుగల కృష్ణశిలామయ మైన ప్రచండప్రదేశము కలదు. దానిచుట్టు రాతితో గోడపెట్టబడి త్రికోణాకృతిగా దుర్గము నిర్మింపబడి నది. కోణకోణమునకు గొప్ప బురుజులు కలవు. దుర్గము యొక్క చుట్టు పరిఘ కొల్చిచూచిన క్రోసు మించి యుండును. దాని బాహ్యస్వరూపమత్యంత భయంకర మై దుర్గద్వారము తప్ప వేరుమార్గమే లేనటుల గానిపించును. దుర్గముపై నుండి చూచిన దూర్పున నిర్మలజలపూరిత మై విశాలముగా బారుచున్న 'నీరా' నదియు నుత్తరమున గురుక్షేత్రంబును బోలిన బయలును, నెదుట మహారాష్ట్రదేశంబునకు నాయుక రత్నంబునుం బోని పూనాపట్టణంబును నైరృతదిశను సాటి సామంతుం డని చెప్పదగు రాయగడదుర్గమును గానిపించు చుండును. సింహగడమిట్లు శత్రువుల కభేద్య మై యుండె. దుర్గము మీద నున్న శిబ్బందియు ప్రబలమైనదియే. ఉదే

ఖాన్ అను పేరువడసిన రాజపుత్రవీరు డచ్చటిసైన్యములకు నాయకుడై యుండెను. రాజపుత్రులు యుద్ధమున బ్రాణ ములనైన ద్యజించెదరు గాని, కాలు వెనుక తీయ రనినమాట సర్వవిదితము. ఇట్లు సర్వవిధముల నసాధ్యమైన దుర్గమును సాధ్యముచేయ నాతానాజీమాలసురే యనువీరుడు బహుళ నవమినాటి రాత్రి చీకటిలో బయలుదేరెను,

పైని వర్ణింపబడిన సంగతు లన్నియు తానాజీమాల సురేకు దెలిసియున్నను, దుర్గము శత్రువుల కసాధ్య మని నమ్మిక కలవారు గనుక దుర్గమువిూద భటు లందరు నజాగ్ర తతో నున్నారన్నసంగతి యాతడు కనిపెట్టెను. కాన రాత్రివేళ నెవ్వరికి దెలియకుండ నెన్నియో కష్టముల కోర్చి యెట్టులైన గోండప్రాకి యాకస్మికముగా గోటవారిని నెది రించిన గోటస్వాధీనము కాగల దని తలచి యాతడు నవమి రాత్రి కోటకు నైర్ఋతమున దనసైనికు లందరును గూర్చికొని పైకి నెక్క బ్రయత్నించెను. ఈ దిక్కునుండి యెక్కుట బహు దుర్ఘట మైనందున నిచ్చటినుండి శత్రువు లెన్నడును రారని తలచి కోటవిూది వారావైపున నంతగా గాపుదల చేయ రైరి. కనుక అచ్చటినుండి వేయిజనముతో నెంతయు గష్ట మున కోర్చి కొంతపైకి వచ్చి యచ్చట సైన్యమును నైదైదు వందల భటులుగా రెండుభాగములు చేసి యొకభాగమునకు దనతమ్ముడైన సూర్యాజీని నధిపతిని జేసి వారిని నక్కడనే యుండ నియమించి, తాను నైదువందల భటులతో బైకి నెక్కెద ననియు, దనకు సాయంబు గావలసినయెడల గ్రింది

వారు పైకి రావలసిన దనియు జెప్పెను. ఒక వీరుడు మిక్కిలి కష్టముతో బైకి ప్రాకి యక్కడ నుండి యొకగొప్పమోకు క్రిందికి దిగవిడిచెను. దానిని బట్టికొని తానాజియు దత్సైన్యం బులును బైకెక్కసాగిరి. ఎక్కినవారు కోటసీమలోనికి వెళ్ళి చప్పుడు చేయక చీకటిలో గ్రిందబరుండియుండిరి. మూడు వందల సైనికులు పైకి నెక్కినతరువాత నేదియో పదార్థము క్రిందబడి ధ్వనియైనందున గోటమీద సైనికులలో నొక్క డది యేమి యైనది కనుగొనుటకు వచ్చి శత్రువులచే హతు డయ్యెను. అది చూచి రాజపుత్రవీరు లందరును నడుములు బిగించి యుద్ధసన్నద్ధులైరి. ఈ సంగతి చూచి తానాజీ మిగిలిన సైన్యము వచ్చుటకు బూర్వమే తన వెంట నున్న మున్నూరు సైన్యముతోనే కోటను సాధింప నెంచి మొట్టమొదట దానే శత్రువులపై బడెను. ఉభయసైన్యములును ఘోరముగా బోరాడ దొడగె. మరాటా సైన్యము పూర్తిగా బైకి రాక పోయినను, వారు వారికంటె నెన్నియో రెట్లధికముగా నున్న రాజపుత్ర సైన్యముతో సమానముగా బోరాడుచుండిరి. ప్రాణములపైనాశ విడిచి మరాటాలు పోరాడుచున్నందున త్వరలోనే కోట మరాటావారి చేతబడునని యందరకు దోపసాగె. కాని యింతలో దానాజీ గాయపడి కీర్తిశేషు డయ్యె[*] సైన్యాధిపుని గతియిట్టులగుట చూచి మరాటావీరు లందరు భయమంది నలుదిక్కులకు బారంజొచ్చిరి. కాని

* క్విబెల్ యుద్ధములో జనరల్ ఊల్ఫు ఈ ప్రకారమే రాత్రిదొంగ తనముగా బైకెక్కి యుద్ధము జయించి యుద్ధములో బడెను.

యింతలో గ్రిందనున్న సైనికు లందరును దీసికొని సూర్యాజీ (తానాజీ తమ్ముడు) పైకి వచ్చి చేరెను. తనయన్న పడుటచే సైనికులు భీతులై పారిపోవుచున్నారని చూచి వారికి "నోడకుడోడకుడి" అని ధైర్యముచెప్పి యెలుంగెత్తి యిట్లనియె; 'రణ హేతుల నిట్టిచ్చుట విడచి పోవుట మీకుధర్మమే! వారి పవిత్రదేహముల దారకలు మాదిగలచే నీడ్పింపరే! మీ రెచ్చటికి బారిపోయెదరు? నేను పైకివచ్చినతోడనే మోకు లన్నియు దెగగోయించినాడను. ఇకశత్రువుల నెదిరించి శివాజీమహారాజునొక్కయు, మీయొక్కయు కీర్తి రక్షించుకొనుటకంటె నొండుమార్గంబు లేదు.' సూర్యాజిచే నుచ్చరింపబడిన యీమాటలు విని కొంతధైర్యము తెచ్చుకొని సైనికులు తిరిగి శత్రువులతో ఘోరముగా బోరసాగిరి. రెండు గడియలవరకు రామరావణయుద్ధమయ్యె. రాజపుత్రసైన్యంబులు విరిగె. రమారమి యేనూర్గురు రాజపుత్రసైనికులును వారి నాయకుడైన ఉదేభానుడును బడిరి. అసంఖ్యజనము పారిపోవుసమయంబున గాలుజారి కొండక్రిందబడి హతమయ్యె. అనేకు లక్కడక్కడ రాలక్రింద దాగియుండి ప్రాతఃకాల మైన తరువాత శరణుజొచ్చిరి. మరాటావీరులలో మున్నూరుగురు సైనికులు హతులైరి. కోటస్వాధీనమైనవెంటనే పూర్వ సంకేతానుసారముగా నొక పెద్దమంటపెట్టి జయవార్త కొరకు రాయగడములో సింహగడము వైపుననే దృష్టి చాచి చూచుచున్న శివాజీకి నావార్త తెలిపిరి. (౧౬౭౦)

గెలిచినారమనినసంతోషముతో రెండవరోజుమరాఠా సైన్యము జయఘోషచేయుచు రాయగడమునకు వచ్చెను. కాని శివాజీ యాసైన్యములలో దనసేనానాయకుని గాన డయ్యె. తానాజి యెక్కడనున్నాడని యడుగగా నాతడు వీరమరణము జెందె ననియు, నాతని ప్రేతమును సూర్యాజి పల్లకిలో వేసికొని వచ్చుచున్నాడనియు దెలిసెను. తానాజి పడె నవినతోడనే దుర్గమును సాధించిన సంతోష మంతయు బోయి మిక్కిలి దుఃఖముతో జయించి వచ్చిన వీరులను జూచి 'సింహగడములోని సింహముపోయి కేవలగడము మనచేత జిక్కినదిసుమా!' యని పలికెను. తనకుగుడిచేయివలెనున్న తానాజి మృతిచెందినందులకు శివాజీమిక్కిలి దుఃఖించె. అఫ్జుల్‌ఖానుని వధసమయమందును, ఢిల్లీప్రయాణసమయ మందును తానాజి శివాజీవెంటనే యుండియెన్నియో కష్టముల కోర్చి స్వామిసేవ చేసెను. అందుచే నాతని మరణమువలన శివాజీకి నమితదుఃఖము కలుగుటయాశ్చర్యముకాదు. సూర్యా జిని బిలిచి "శౌర్యమున అన్న పేరు నిలిపితి" వని కొనియాడి యాతడు గెలిచిన దుర్గమునకు నాతని నధిపతిజేసెను. సింహ గడము సాధించిన నెలరోజులకు పురందరదుర్గంబును మరా టాల స్వాధీనమయ్యెను. ఈకోటనుసాధించినవాడు సూర్యా జియే (౧౬౭౦ మార్చి)

కొంకణములో మోరోపంతుపింగళే పేష్వామా హులీ యనుకోటను ముట్టడించెను కోటలోనివారు హోరా హోరిగా బోరాడి వేయిమంది మరాటావీరుల బడవైచి

వారిని బారదరిమిరి. పేష్వామరల దనసైన్యములగూర్చికొని కోటమీదికివచ్చి మరల దరుమబడియె. అయినను పేష్వా యాకోటను ముట్టడించి రెండునెలలవరకు విడిసి యున్నందు నను దుర్గములోనివారి కెక్కడినుండియు సాయము రానందున గోటలోనివారు కోట పేష్వాల కిచ్చివేసి వెడలిపోవలసిన వారైరి. తరువాత పేష్వా కరనాళా యనుదుర్గమును సాధించెను. ఇట్లు జూన్ నెల ఆఖరువరకు కొంకణములోని కళ్యాణ ప్రాంత మంతయు మరాటావారికి లోబడియె.

జంజిరాయను దుర్గమును సాధింపవలయునని ౧౬౬౯వ సంవత్సరమునుండి శివాజీ యాలోచన చేయుచుండెను. ప్రతిసంవత్సరము నాదుర్గమును ముట్టడించి కోటలోని శిద్ది వాడు నేడు శరణువచ్చును, రేపు శరణువచ్చు ననుకొనుచునే కాలము గడిపెను. గాని, శిద్ది స్వాధీనము కాడయ్యె. ౧౬౭౦ వ సంవత్సరములో శివాజీ సిద్దిని నెట్లయిన సాధింప వలయునని యాతనిపయి గొప్పసైన్య మంపెను. నీవు మమ్ము శరణు జొచ్చిన నీకిదియిచ్చెద మది యిచ్చెద మని యాశయు జూపెను. తుదకు దుర్గాధిపతియైన ఫత్తేఖానుడు మరాటాలకు దుర్గమిచ్చివేయుటకు సిద్ధపడెను. కానియాతనిచేతిక్రిందముగ్గురు సైన్యాధిపతులీమాటకు నొప్పుకొనక, దుర్గము శత్రువులకిచ్చి వేయు నేమో యను భయముచేత ఫత్తేఖానుని జెరబట్టి, మరి యొకని నధిపతిగా నేర్పరుచుకొని ఔరంగజేబు కిట్లు వర మాన మంపిరి. 'జంజిరా మీకు నిచ్చివేసెదము. ఇదివరకు విజాపూరివారి చేతి క్రింద సామంతులుగా నున్నటుల నింక

మీద మీయొద్ద సామంతులుగా నుండుదుము. మా సముద్ర సైన్యమును మీసేనలోనే యుంచుకొనవలసినది.' ఔరంగజేబు వారిమాటలు అంగీకరించి యాదుర్గమును స్వాధీనపరుచు కొనెను. ఇట్లు మరాటీవారెంతయత్నము చేసినను జంజిరా వారి స్వాధీనము కాక మొగలులస్వాధీన మయ్యెను. ఇటువలనే శివాజీ జన్మస్థానమైన శివనేరదుర్గము సాధించుటకు నెంతయో ప్రయత్నము చేసియు మరాటావారు విఫలమనోరథులు గావలసిన వారైరి.

క్రీ. శ. ౧౬౭౦ వ అక్టోబరు నెలలో శివాజీ ధనముచే విర్రవీగియున్న సూరత్ పట్టణము రెండవసారి దోచికొనెను. పదునైదువేల మహారాష్ట్రవీరులతో శివాజీ సూరత్ పట్టణమునకు వెళ్ళునప్పటికి నచ్చట నెదిరించుటకు వేయిభటు లయినను లేకయుండిరి. అందుచే మరాటాదండు భయమువిడచి నెమ్మదిగా మూడు దినములవరకు బట్టణమును గొల్లగొట్టెను. అచ్చటనున్న ఐరోపీయ వర్తకులలో నింగ్లీషు వర్తకులు మాత్రము స్వసంరక్షణము చేసికొనిరి. డచ్చివారివర్తకశాల దూరముగా నున్నందున మరాటావారు వారిజోలికి బోరయిరి ఫరాసులనబడు ఫ్రెంచివారు మరాటావారికి త్రోవయిచ్చి కొత్తగా మక్కానుండి వచ్చి యాపట్టణములో విడిసియున్న కాస్కరుపట్టణపు పదభ్రష్టుడైన యొకరాజువిడిదికి బోనిచ్చినందున వారి వర్తకశాల బందిపోటు వారి పాలు కాదయ్యె. ఆ పట్టణములో శివాజీకి సమితధనము దొరకె ననిచదువరులు గ్రహించియే యుందురు.

బర్హాణపురమునుండి తనమీఁదికి నొక్క ప్రచండమైన మోగలసైన్యము వచ్చుచున్నదని మూఁడవరోజు శివాజీకి దెలిసినందున నాతఁడు తనసైన్యములను దీసికొని తనరాజ్యమునకు బయలుదేరెను. బయలుదేరునప్పు డాతఁడు సూరత్ పట్టణవాసుల కిట్లు వర్తమాన మంపెను. 'మీరు ప్రతిసంవత్సరము పండ్రెండులక్షలరూపాయలు కప్పము కట్టుచుండవలసినది. లేనియడల మేము ప్రతిసంవత్సర మెప్పు డోయొక సారి మీపట్టణ మిట్టులనేకొల్లగొట్టుచుండెదము' శివాజీ దొరకిన సొత్తంతయు దీసికొని కంచనమంచన మనబడు పర్వతము మీఁదినుండి పోవుచుండగా, దాఊద్ ఖాన్ అను మోగలసరదారుడైదువేల సైన్యముతో దనవెనుక వచ్చుచున్నాఁడనియు, గొంకణదేశములోనికి దిగునప్పుడు నాసికపట్టణమునొద్ద దగులు కనమలయొద్ద మరియొక మోగలుల గొప్పసైన్యమువిడిసియున్నదనియు వినెను. సూరత్ పట్టణములో సంపాదించిన యపారధన మీ యుభయ సైన్యముల చేతిలోబడకుండ దప్పించుకొనుట కెద్ది యుపాయంబని యోజించి శివాజీ తనసైన్యమును నాలుగయిదు భాగములు విభజించి యొకభాగమున శత్రువులగొప్పసైన్యముతో బోరాడుచు, వీలుకానప్పుడు బారిపోవుచు శత్రువులకు బని కల్పించుచుండుమనట్లును, మరిరెండు భాగములిటునుండి కొంతసేపు, నటునుండి కొంతసేపు శత్రువులపై బడునటుల నటించుచు శత్రుసైన్యములను నిటునటు తొలగించుచుండునటులను, ఇంకొకభాగము ధనమంతయు దీసికొని యెవరికి దెలియ

కుండ దాటునట్లును నియమించెను. ఇట్లు తన యసామాన్య ప్రజ్ఞచేత ధనమంతయు ముందు తనదేశము చేరునట్లు చేసి శివాజీ వెనుక చిక్కిన సైన్యములతో వచ్చుచుండగా, మొగల సరదారుడగు దావూద్ ఖాన్ అతనిని సమీపించెను. కాని శివాజీ అకస్మాత్తుగా వెనుకకు దిరిగి శత్రుసైన్యములపైపిడుగు పడునటుల బడిన తోడనే యాతడు వెనుకకు పారవలసినవాడాయెను. తరువాత శివాజీ తనసైన్యముల నన్నిటిని గూర్చికొని కొంతదూరముబోయి తనతో బోరాడుటకై నిలిచియున్న మొగలుల సైన్యముపై బడెను. ఉభయసైన్యములు ఘోరముగా బోరాడె. తుదకు మొగలులకే యపజయము ప్రాప్తించె. ఈ యుద్ధలో మాహూర్ పట్టణమునకు దేశముఖయైన రాయగాబీణ్ అను శూరవనిత మొగలుల పక్షావలంబనము చేసి శివాజీతో బోరాడెను. తుదకు నాబిడ శరణుచొచ్చినందున నామెను సన్మానించి శివాజీ యామె గ్రామమునకు బంపెను.

శివాజీ స్వస్థానమునకు వచ్చిచేరిన తరువాత ప్రతాపరావుగుజర్ అనువానికి బదివేలగుర్రంబులను, పేష్వాయైన మోరోపంతు పింగళేకు నిరువదివేల కాల్బలమును నిచ్చివారిని నుత్తరమునకు బంపెను. మొదటసముద్రతీరమున నున్న భడోచ్ పట్టణమును దోపవలయునని వారి యభిప్రాయమై యుండెను. సముద్రముమీదనుండియు బట్టణమునకు భీతికలుగ జేయవలయునని శివాజీ తన నూట యరువదియోడలను ఆపట్టణము వైపునకు బంపెను. కాని కొన్నిదినములకు నేహా

తువుచేతనో గాని వారియుద్దేశము మాని శివాజీ తనయోడ లను మరల బిలిపించుకొనెను. ఓడలు తిరిగి వచ్చుచున్నప్పుడు దమణిఅను రేవులో గొన్ని పోర్చుగీజు వారి యోడలుండెను. ఆయోడలనుబట్టి మరాఠాయోడలవారు దీసికొనివచ్చిరి. కాని దీనికి బదులుగా పోర్చుగీజువారు మరాఠావారి కొన్ని యోడలను బట్టుకొని పోయిరి.(౧౬౭౧)

భడోచ్ పట్టణమువైపున నున్న సైన్యములను బిలిపించి శివాజీ వానిని * ఖానదేశమునకు బంపెను. అందుమోగలుల సైన్యములు లేనందున ప్రతాపరావుగుజర్ దేశమంతయు గొల్లగొట్టుచు ప్రతిపట్టణమునుండి యప్పనంబులు గొనుచు విశేషముగా ధనార్జనము చేసెను. ప్రతిగ్రామపు పటేల్ కరణములయొద్దనుండి మేము మోగలులకిచ్చు కరభారములో నాల్గవ వంతు శివాజీకి నియ్యగలవారమని వ్రాయించుకొనెను. ఈనాల్గవ వంతిచ్చినవారికి దాను రసీదిచ్చెదననియు, ఎవరియొద్ద రశీదుండునో వారిని మరాఠావారు బాధ పెట్టరనియు గ్రామస్థులతో జెప్పుచు వచ్చెను. మోగలుల రాజ్యములో మరాఠావారు చౌథ్ అనుపన్ను వసూలుచేయుటకు బ్రారంభించిన కాల మిదియె. అటు మోరోపంతు పేషవాగారు ఆవఢా, పట్టా, సాలేర్ మొదలయిన దుర్గములను సాధించిరి. (౧౬౭౧ జాన్యుఅరి)

ఇట్లు దక్షిణమున శివాజీ మోగలులరాజ్యమును గొల్లకొట్టుట విని ఔరంగజేబు తనకుమారుడయినమోఆజిమ్ అను

---

* బొంబాయి రాజధానిలోని కొంతభాగము.

నాడును యశవంతసింగును శివాజీతో గలసి యున్నారని సంశయించి యశవంతసింగును నుత్తరమునకు బిలిపించుకొని మోహబత్ ఖాన్ అనువానిని నలుబదివేల సైన్యముతో దక్షిణమునకు బంపెను. మోహబత్ ఖానుడు రాజపుత్రుని లక్ష్యపెట్టక స్వతంత్రించి మరాఠావారితో యుద్ధములు చేయసాగెను. (౧౬౭౧)వర్షాకాలము వచ్చువరకు నాతడు రెండు దుర్గములను సాధించెను. పూర్వమువలెనే దిలేర్ ఖానుడు సైన్యములో రెండవ యధికారియైయుండెను. ఈతడు తన సైన్యములను రెండు భాగములుగా విభజించి యొక్క సైన్యముతో చాకణ్ దుర్గమును, మఱియొక సైన్యముతో సాలేర్ దుర్గమును ముట్టడించెను. సాలేర్ దుర్గమునకు ఖానదేశముయొక్క ద్వారమని పేరు. ఆసంవత్సరమునందు నీదుర్గములో మరాఠావారు వలయునంత సామాగ్రి సంగ్రహించి యుంపరైరి. ఆదుర్గమునకు సమీపమునందుంపబడిన రెండువేల గుఱ్ఱములను దురుష్కులొక్కసారి నాశము చేసిరి. ఈసమాచారము తెలిసినతోడనే శివాజీ సాలేర్ దుర్గ సంరక్షణార్థమై యిరువదివేలగుఱ్ఱపు శిబ్బందినిచ్చి ప్రతాపరావుగుజర్‌ను, పేష్వామోరోపంతుపింగళేనుబంపెను. మరాఠాగుఱ్ఱము తమమీదికి దండు వచ్చుచున్నదని విని వారిని త్రోవలోనే నెదిరించుటకై తనసైన్యమంతయు నిచ్చి యఖలాసఖానుని బంపెను. ప్రతాపరావు మరాటసైన్యమునకు మొనగాడై నడచుచున్నందున దురకలరాక చూచి వారిని మోసపుచ్చ దలంచి శత్రువులు పైబడినప్పుడు పారిపోయినటుల నటింప వలసినదని తన సైన్యములకు

చెప్పియుంచెను. యఖలాసఖానుడు యుద్ధము ప్రారంభించినవెంటనే మరాటావీరులు పారజూచిరి. తురకలు వారివెంట దగిలి తరుమునప్పుడు దట్టముగా నుండక యక్కడక్కడొక్కొక్కరుగా నిల్చిరి. అదిచూచి పారిపోవు మరాటాసైనికులు మరలి శత్రువులపైబడి చెండాడసాగిరి. అటు ప్రతాపరావు సైన్యము, ఇటు పేష్వాలసైన్యము చెండాడగా తురకల సైన్యములు తాళలేక పారజొచ్చెను. మొగలసైన్యాధిపతులు పారిపోవుసైనికులను బోగుచేసి మరలమరల మరాటావారితో బోరాడ యత్నించిరి. కాని మరాటావారి శౌర్యమునకు దాళలేక చెదరిరి. మొగలుల సేనానాయకులలో నిరువది యిద్దరు హతులైరి. కొందరు గాయముపడి మరాటావారిచేత చిక్కిరి. మరాటావారి సరిదారులనేకులు నిహతులైరి. నిహతులైనవారిలో సురేరావ్ అనువాడు విశేషవిఖ్యాతుడై యుండెను. ఈతడు శివాజీకి బాల్యస్నేహితుడు. శివాజీచే నియమింపబడిన పనులు చక్కగా నెరవేర్చుచున్నందున పంచహాజారీయను పదవి జెందియుండె. గాయుపడినవారును, నిహతులైనవారును గూడి యైదువందల మరాటావీరు లీయుద్ధమునకు బలియైరి. ఈయుద్ధము బహుఘోరముగా జరిగినదని చెప్పెదరు. యుద్ధస్థలమందు క్రోసెడుదూరమువరకు ధూళిమొగిరి యెదుటిభటుండు శత్రుడైనది, మిత్రుడైనది, వీరులకు దెలియకుండె. రక్తము వరదలుగా బారినది. ఈ యుద్ధాంతమున మరాటావారికినూటయిరువది యేనుగులును, ఆరువేలయొంటెలును, ఆరువేల గుఱ్ఱంబులును దొరకెను. ఇదిగాక నాణెము

లును, రత్నములును, విలువగల బట్టలును అనేకముగా దొరకెను.

గాయపడి మరాటావారిచేత జిక్కిన తురకసరదారులను శివాజీయొద్దకు దీసికొనిపోగా, నాతడు వారిని గౌరవించి వారికి నౌషధోపచారములు చేయించి బాగయిన పిదప వారిని వారివారిదేశములకు బంపివేసెను. వారిలో నిష్టమున్న కొందరను దనసైన్యములో నుంచుకొనెను.

చాటులేని సమరాంగణముమీద శత్రువులను నెదిరించి వారిని మహారాటావారు పరాజయపరచుట మొదటనీయుద్ధమునందేయని చరిత్రకారులు చెప్పెదరు. ఈయుద్ధమప్పటినుండియు మరాటావారి శౌర్యవిఖ్యాతి దిగంతవిశ్రాంతమయ్యెను.

మరాటావారి వలన దనసైన్యమున కిట్లు పరాభవము కలుగుట విని, ఔరంగజేబు బాదషహా తనకుమారుడయిన మొఆజీమును, మొహాబత్‌ఖానుని దక్షిణము నుండి ఢిల్లీకి బిలిపించుకొని, గుజరాత్‌దేశపు సుబేదారుడగు ఖాన్‌జహాన్ బహద్దర్ అనువానిని దక్షిణమునకు సుబేదారునిగా బంపెను. కాని వానిచేతిక్రింద బూర్వపు దిలేర్‌ఖానునే రెండవ యధికారిగా నుంచెను. తనయొద్ద సైన్యము విశేషముగా లేనందున శత్రువుల రాజ్యములోనికి వెళ్ళి పోరాడుట మంచిదికాదనియు, శత్రువులు మన రాజ్యములోనికి రాకుండ గాపాడుకొనిన జాలుననియు దలచి, సుబేదారుడు, మరాటావారు కొంకణము నుండి పయికి వచ్చు కనుమలన్నియు, మరి యితర త్రోవలన్నియు సంరక్షించుటకు దనభటులను నియమించెను. ఇటుల

జేసిన లాభము లేదనియు, వారి దుర్గములను సాధించినగాని శత్రువులు లొంగరనియు, దిలేరుఖానుం డెంతచెప్పినను సుబేదారుడు వినడయ్యె. ఇటు మరాటావారు కనుమలనుండి ఖానదేశమునకు వెళ్ళగా, ఔరంగాబాదు మొదలయిన ప్రదేశములకు దాడివెళ్ళి, గ్రామములు కొల్లగొట్టసాగిరి. వారి నెదిరించుటకై అనేక దిక్కులనుండి అనేక స్వల్పసైన్యములను సుబేదారు డంపెను. కాని మరాటావారి యుద్దేశము తురకలతో బోరాడుటకాక తురకలరాజ్యమును గొల్లగొట్టి వీలయినంత ధనము తీసికొని పోవుటయే యైనందున, వాండ్రు శత్రువులతో బోరాట తప్పించుకొని పెక్కుసారులు పారిపోవుచుండిరి. కాని తమచేత జిక్కిన ధనము మాత్రము శత్రువుల చేతిలో నెన్నడును దొరకనిచ్చిన వారు కారు. ఇంతలో వర్షాకాలము నారంభ మయినందున సుబేదారుడు యుద్ధముమాని భీమానదీ తీరమునం దున్న యొక గ్రామములో నాలుగు నెలలు విడియ వలసిన వాడాయెను. అతడక్కడ నొక దుర్గమునిర్మించి, దానికి దన పేరిట బహాదుర్‌గడమని పేరుపెట్టెను. అప్పటి నుండి నలుబది సంవత్సరముల వరకును మొగలుల సైన్యమునకు బహాదుర్‌గడమే ముఖ్యమైన విడిదియై యుండెను.

౧౬౭౭లో శివాజీ గోలకొండపై దాడివెడలి యచ్చటి సుల్తాను నొద్దనుండి యనేక ధనంబప్పనంబుగా గొనియె. అటు శివాజీ వెళ్లుట చూచి ఔరంగజేబు జింజీసిద్ది ఈ యిద్దరుకూడి పడవ లనేకములు పోగుచేసుకొని సముద్రము మీదినుండి కొంకణదేశముపైకి వచ్చి, శివాజీ రాజ్యములోని యనేక గ్రామ

ములనుగాల్చి కొల్లగొట్టిరి. ధుండీరాజపురములోనున్న శివాజీ యొక్క సముద్రసైన్యమంతయు నాశముచేసిరి. ఈయుద్ధములో రాఘోభల్లాలుడను నొక వృద్ధమరాటవీరుడు పడెను.

విజాపూరునవాబు కాలముచేసి యచ్చటిమంత్రుల పరస్పరకలహములవలన నరాజకమైనందున సమయ మిదియే యని తలచి, శివాజీ సైన్యమును విశాలగడముపై జేర్చి, యందు గొందరను పన్హాళా దుర్గముపైకి బంపి దానిని సాధించెను. కొందరకు అణ్ణాజీదత్తోయను సేనానాయకునిగా నిచ్చి, హుబ్బళ్ళీ పట్టణముపైకి బంపెను. మరాటావారా పట్టణమును దోచుకొని సూరత్ పట్టణములో దొరికిన ధనముకంటె నధిక ధనమును సంపాదించిరి. అచ్చట ఇంగ్లీషు, ఫ్రెంచి, డచ్, మొదలైన పాశ్చాత్యుల దుకాణము లుండెను. వారందరయొద్ద నుండియు మరాటావారు ధనము గైకొనిరి. ఇంగ్లీషువారి దుకాణములలో ౭౮౯౪ వరహాలు మరాటావారికి దొరకెను. (౧౬౭3 మార్చి)

ఇట్లు విజాపూరువారితో యుద్ధము పెట్టుకొన్నందున నిటు మోగలులతో, నటువిజాపూరివారితో నొక్కసారిపోరాడుట మిగులకష్టమనితలచి శివాజీ మోగలులతో 'మేము మీరాజ్యముజోలికి రాము; మీరు మారాజ్యముజోలికి రావలదు' అని సంధిచేసికొనెను.

మరల సముద్రసైన్యము గూర్చుకొని కార్వార్, అంకోలా మొదలైన సముద్ర తీరమునందున్న విజాపూరువారి గ్రామములపైకి నాసైన్యమును బంపెను. ఆ ప్రాంతములోని

దేశముఖు దేశపాండ్యాలను వశపరచుకొని వారు విజాపూరు వారిపై దిరుగబడినట్టుల జేసెను. తురకఠాణేదార్లనందరను వెడలగొట్టింపసాగెను. ఈయాగమంతయు జూచి పేదనూరు ఠాణా యధికారి భయపడి శివాజీకి వశుడై ప్రతిసంవత్సరము కప్పము కట్టుటకు నొప్పుకొనెను.

౧౬౭౩ లోనే పరళి. సాతారా, చందనవందన్. పాండుగడ్, సాందగిరీ, గాలోరా మొదలైన శత్రుదుర్గములను శివాజీ సాధించెను. ఇట్లు శివాజీ విజాపూరివారి దేశములోని కోటలను ఎదురులేక జయించుట చూచి విజాపూరువారు భయపడి అబ్దుల్‌కరీమ్, బహిలోల్ఖాన్ అను వానిని పండ్రెండువేల సైన్యముతో బన్హాళా కోటవైపునకు బంపిరి. ఆప్రాంతమునందు మరాఠాలచే స్వాధీనపరచుకొనబడిన కొన్నిదుర్గములను వాడు మరల సాధించెను. ఈ సంగతి తెలియగానే శివాజీ గొప్పసైన్యమిచ్చి ప్రతాపరావు సర్ నోబత్ అనువానిని వారిమీదికి బంపెను. ప్రతాపరావు విజాపూరు రాజ్యములోనికి జొరబడి విజాపూరువరకు పట్టణములను గాల్చి పేల్చి దోచుకొనసాగెను. ఆతని నెదిరించుటకై విజాపూరుసైన్యములు తిరిగి వచ్చుచుండగా ఉంబరాణి యొద్ద నుభయ సైన్యములు కలసి రెండు జాములవరకు హోరాహోరిగా బోరాడెను. మరాటావారు తురకసైన్యములను నలుదిక్కులనుండి చుట్టుకొని వారికి త్రాగుటకు నీళ్ళుదొరకకుండ జేసిరి. ఇంతలో ప్రొద్దుగుంకె. అప్పుడు తురుష్కులు నిరుపాయులై మేమిక మీరాజ్యములోనికి రాము. మమ్ము

నిప్పుడు పోనియ్యవలసినది అనివేడుకొనిరి. ప్రతాపరావు సదయచిత్తుడైనందున శత్రుప్రార్థన నంగీకరించి వారిని బోనిచ్చెను. శత్రువులిట్లు చేతజిక్కినప్పుడు వారినింతసులభముగా విడిచి పెట్టినందులకు శివాజీ ప్రతాపరావుని నిష్ఠురములాడగా నాతడు కోపగించి దూరముగా విదర్భదేశమునకు దాడివెడలి పోయెను.

ప్రతాపరావు దూరదేశమునకు వెడలిపోవుట చూచి బిజాపూరు సైన్యము పన్హాళాదుర్గమును సాధించుటకై తిరిగి వచ్చెను. శివాజీకీ వర్తమానము తెలిసెను గాని ప్రతాపరావు దూరదేశమున నుండినందునను, వేరు సైన్యమొద్దలేనందునను నాతడు తురుష్క సైన్యమును నెదిరింపలేక పోయెను. ఇంతలో నీ వృత్తాంత మెట్టులనో తెలిసి ప్రతాపరావు పన్హాళాదుర్గమునకు వచ్చి తురుష్కుల నెదిరించెను. అప్పుడు శివాజీ యాతని కిట్లు వర్తమాన మంపెను. 'వెనుక నీ సైన్యములు మీచేత జిక్కినప్పుడు వీరిని నాశముచేయక వదలినందులకు వీరిప్పుడు మరలమరల మనలను బాధపెట్ట వచ్చినారు. ఇకనైనను వీరి నందరను నశింపజేయక నాకు ముఖము చూపనక్కరలేదు.' యుద్ధముచేయుటకు సిద్ధముగా నున్నప్పు డిట్టివార్త వచ్చినందున ప్రతాపరావు రోషద్వేషాంధుడై తగిన వ్యూహము నేర్పాటు చేసికొనక, తగినకాలము నపేక్షింపక యొక్కసారి శత్రుసైన్యముపైబడెను. అట్లవ్యవస్థగా యుద్ధమునకు వెడలినందున నాతడు ఘోరముగా బోరాడినను రణరంగమున దోడి భటులతో దెగవలసిన వాడాయెను. సేనాధిపతి తెగినతోడనే

ఇతరభటులు వారికి బుద్ధిచెప్పిరి. ఇట్లు మరాటాబలములు విరిగి పారుచుండ నక్కడికి కొంతదూరమున నున్న హంసాజిమోహితే యను పంచహజారీ సరదారుడు దేవుని వలె నడ్డపడి మరాటాలకు 'ఓడకుడి ఓడకుడి' అని ధైర్యమిచ్చి అది వరకు మరాటాలను దరుముకొని వచ్చుచున్నట్టి చెదరియున్న తురుష్కసైన్యముపైబడి చెండాడెను. అది చూచి పారిపోవుచున్న మరాటా వీరులును దిరిగి తురుష్కులతో యుద్ధము చేయసాగిరి. అందువలన మరాటాలను దరుముచు వచ్చిన తురుష్కులు మరాటాలచే దరుమబడిన వారైరి! ఈ యుద్ధము జేసరిగ్రామమునొద్ద జరిగెను. ఈయుద్ధవార్త తెలియగా బ్రతాపరావు తెగుటకు శివాజీ మిగుల జింతించి యాతని కుటుంబము రక్షించుభారము తానువహించి యతని కొమార్తెను దన రెండవ కుమారుడైన రాజారామునకు వివాహము జేసికొనెను. పరాజయమును జయముగా మార్చినహంసాజిమోహితే యను వీరునికి అంబీరావు అను బిరుదునొసంగి మృతిజెందిన బ్రతాపరావుయొక్క సర్ నోబత్ అను నధికారము నిచ్చెను. అటులనే సంతాజి ఘోరపడే ధనాజిజాధవ్ అను వీరులీయుద్ధమునందు మిగుల శౌర్యమును చూపిరిగాన, వారిని జుమ్లాదారుఅను నధికారమునుండి తీసి యంతకు పైయధికార మగుసరదారుల వర్గములో జేర్చెను. (౧౬౭౪ ఫిబ్రేవరి)



## పంచదశ ప్రకరణము

### రాజ్యాభిషేకమహోత్సవము.

ఎవ్వడైనను రాజ్యాభిషేకవిధి జరుగదేని 'రాజ' పదమున కర్హుడు కానేరడనియు, ఆ విధి జరుగువరకు నాతడొక పాళెగారు లేక జమీందారుతో సమానుడనియు హిందూధర్మశాస్త్రముయొక్క యభిప్రాయమైయున్నది. పూర్వపు మూర్ధాభిషిక్తులైన రాజులవలెనే శివాజీ రాజ్యమునందు న్యాయవిచారణయు, అష్టప్రధానులును, చతురంగసేనయు, జలస్థల పర్వత దుర్గంబులును మొదలైన యన్ని రాజ్యాంగము లుండెను. గోలకొండ, విజాపూరువారు లొంగి యప్పనంబు లిచ్చుచుండిరి. ఢిల్లీశ్వరునితో సాటిదొరవలె బోరుచుండె. తన పేరిటి నాణెములును దేశములో జెల్లుచుండె. ఇట్లు రాజలక్షణములన్నియు నుండి ముఖ్యమైన మూర్ధాభిషేకము లేకపోవుట యశాస్త్రీయమని యెంచి శివాజీ యభిషేకవిధియు, సింహాసనారూఢవిధియు సశాస్త్రీయముగా జేయదలచె. ఒక గొప్ప సభచేసి తన సరదారు లందరను రావించి, వారికి దన మనోభీష్టము తెలియ జెప్పె. వారందరును నందులకు సంతసించి సమ్మతించిరి. రామదాస స్వాములవారును ననుజ్ఞ యిచ్చిరి.

గొప్ప విద్వాంసులను, బండితులను బంపించి రాజ్యాభిషేకవిధి యెట్టిదియో యని చర్చింపజొచ్చిరి. ఒకరొకవిధముగాను, మరియొకరు మరియొకవిధముగాను జెప్పసాగిరి. హిందూరాజ్యము, సింహాసనము, ఛత్రచామరములు, అభిషేకవిధి మొదలైన సంగతులన్నియు నిదివరకే నాలుగువందల సంవత్సరములు పూర్వము లోపించినందున దాని గురించిన శాస్త్రములును లోపించియుండె. అందుచే నప్పటి పండితులకు రాజ్యాభిషేకంబన బునఃసృష్టియయ్యె. అప్పుడచ్చటి పండితులుచెప్పగా నాలుగు వేదంబులును షట్చాస్త్రంబులును బూర్తిగా జూచిన గాగాభట్టను బ్రాహ్మణుని గాశినుండి మరికొందరు పండితులతో బిలిపించిరి. వారందరును నొకసభచేసి శాస్త్రోక్తముగా రాజ్యాభిషేకవిధి యంతయు నిర్ణయించిరి. అభిషేకముహూర్తము ఆనందనామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ త్రయోదశీ గురువారమునా డేర్పరచిరి. (౧౬౭౪ జూన్ ౬)

సిద్ధతయంతయు నైన పిదప బ్రాహ్మణులకు నొక సంశయము కలిగెను. మూర్ధాభిషేకము క్షత్రియులకేగాని యితరులకు లేదు. శివాజీ క్షత్రియవంశ సంజాతుడని నిశ్చయముగా దెలిసినగాని యభిషేకము చేయుటకు వీలులేదని వృద్ధ గాగాభట్టులవారు స్పష్టముగా జెప్పిరి. అప్పుడు శివాజీ ఉదయపురమునకు జారుల బంపి యచ్చటి వంశవృక్షములను దెప్పించి యచ్చటి రాజపుత్రులును దానును నొక్క వంశమువార మని నిర్ణయించి గాగాభట్టును మెప్పించెను. ఇట్లీసంశయము తీరిన తరువాత మరియొక సంశయము కలిగెను. శివాజీ కప్పటికి

ఇద్దరు పుత్రులు గలిగి నలుబదియేడు సంవత్సరముల వయ స్సుండెను. బ్రాహ్మణునకు బదునాఱు సంవత్సరములవరకును, క్షత్రియులకు నిరువదినాలుగేండ్లవరకును ఉపనయనము కాని యెడల వారు వర్ణభ్రష్టులై వ్రాత్యులన బడుదురు. అందుచే నుపనయన మదివరకు లేని శివాజీ ధర్మశాస్త్రానుసారము వ్రాత్యుడయ్యెను. వ్రాత్యునకు మూర్ధాభిషేక మెక్కడిది ? అప్పుడు పండితులు శాస్త్రములను వెదకి శివాజీచేత వ్రాత్య స్తోమయజ్ఞమును చేయించి, యాతని వ్రాత్యత్వదోషమును బాపి యాతనికినలుబదియేడవయేట మౌంజిబంధనముచేసిరి. జ్యేష్ఠ శుద్ధమందు చవితికి నుపనయనమైన పిదప, షష్ఠినాటివరకుపట బంధనవిధి పూర్తియై ముఖ్యయజ్ఞమునకు ప్రారంభమాయెను. ఆయజ్ఞ మేడుదినములవరకు జరిగెను. నిత్యము నేబదివేల బ్రాహ్మణులకు అన్నదానము జరుగుచుండెను. శివాజీయు ఋత్విజులును మాత్రము ఘృతము, పయస్సు,ఫలములుభక్షిం చుచు నేడుదినములవరకు వ్రతస్థులయి యుండిరి.

శుద్ధత్రయోదశి రోజున శివాజీ మంగళస్నానము లాచ రించి భవానీదేవి, తల్లి, కులగురువు, ఋత్విజులు మొదలయిన వారికందరకు నమస్కరించి యనుజ్ఞాతుడయి యభిషేకము జేయించుకొనుటకు సుముహూర్తమున సింహాసన మెక్కెను. భార్యలిద్దరు పటబంధన మాచరించి పట్టమహిషులుగా నభి షిక్తలగుటకు శివాజీ యొద్దకు వచ్చి కూర్చుండిరి. కొమాళ్ళి ద్దరును వచ్చి మరియొకప్రక్క గూర్చుండిరి. ఎనిమిది దిక్కు లను అష్టప్రధానులు నొక్కరు ఛత్రమును, నొక్కరుచామర

మును, నొక్కరు సువర్ణకలశమును, నొక్కరు రౌప్యకలశమును బట్టుకొని సింహాసనమునకు జుట్టు నిలచియుండిరి. వైదికబృంద మంతయు వేదఘోషచేయుచు మంత్రోదకములను రాజుపై జల్లుచునిలచిరి. మంగళ వాద్యములు, భేరీ మృదంగములు నృత్యగానములు, వందిమాగధజయశబ్దంబులు, ఫిరంగిమ్రోతలు మొదలయిన వానితో నలుదిక్కులు ఘూర్ణిల్లె. అప్పుడు మూర్ధాభిషిక్తు డయినరాజు తులాపురుష దానముచేసి పదు నారువేల వరహాలు బ్రాహ్మణులకు బంచి పెట్టెను. గాగా భట్టునకు లక్షరూపాయలు దక్షిణయొసంగె. ఋత్విజునకొక్కొ క్కనికి నయిదువేల రూపాయలు సంభావనగా నిచ్చెను. ఇతర విద్వాంసుల వారివారి యోగ్యతానుసారము గౌరవించె. తన మంత్రులకు నితర సేవకులకు నేనుంగులు, గుర్రంబులు' పల్ల కులు, బంగారుకంటెలు బహుమతిగానొసంగె. రాజ్యాభిషేక సమయమున శివాజీ తనయష్ట ప్రధానులకు నదివరకున్న తురు ష్కనామములను దీసి, సంస్కృత నామములుగా మార్చెను. పూర్వము సర్‌నోబత్, న్యాయాధీశుడు అనుపేరుగల అధి కారు లిద్దరుండిరి. వారిని నొక్కరొక్కరిగా మార్చెను.

అష్టప్రధానుల వార్షిక వేతనములను వృద్ధిచేసెను.

| అధికారి పేరు. | అధికారముయొక్క పూర్వపు పేరు. | క్రొత్తగా బెట్ట బడిన పేరు | వేతనము హోనులు. |
|---|---|---|---|
| ౧ మోరోపంత్ పింగళే | పేషవా | ముఖ్యప్రధాన్ | ౧౫౦౦౦ |
| ౨ రామచంద్రపంత్ | ముజుందార్ | పంత్ అమాత్య | ౧౨౦౦౦ |
| 3 అణ్ణాజిదత్తో | సురనీస్ | పంత్ సచీవు | ౧౦౦౦౦ |
| ౪ దత్తాజిపంత్ | వాకనీస్ | మంత్రి | ౧౦౦౦౦ |

| | | | |
|---|---|---|---|
| ౫ హంబీరరావుమోహితే సర్‌నోబత్ | | సేనాపతి | ౧౦౦౦౦ |
| ౬ జనార్దనపంత్ | డబీర్ | సుమంత్ | ౧౦౦౦౦ |
| ౭ బాలాజీపంత్ | న్యాయాధీశుఁడు | న్యాయాధీశుఁడు | ౧౦౦౦౦ |
| ౮ రఘునాథపంత్ | న్యాయశాస్త్రి | పండితరావు | ౧౦౦౦౦ |

రాజ్యాభిషేకమయినప్పటినుండియు, శివాజీ రాజ్యాభిషేక శకమని తనపేరిట క్రొత్తశకమును ప్రారంభించెను. అన్ని వ్యవహారములందును దన్ను 'క్షత్రియ కులావతంస శ్రీరాజా శివచ్ఛత్రపతి' అని సంబోధించవలయు నని యాజ్ఞాపించెను.

ఈ రాజ్యాభిషేక మహోత్సవమునకు గోలకొండ నవాబు తనమంత్రులను బంపి ధనకనకవస్తువాహనంబు లనేకములు శివాజీకి గానుకయిచ్చెను. ఇతర మాండలిక రాజులును, పాళెగారులును, ఇంగ్లీషు, పోర్చుగీజు మొదలయిన పరదేశీయ వర్తకులును, ఈ మహోత్సవ సమయమున శివాజీకి ననేక కట్నంబు లిచ్చిరి. ఇంగ్లీషువారు శివాజీతో సంధిచేయుటకయి పంపిన హెన్‌రిఆక్సెండేర్ అనుదూత ఈయుత్సవసమయమున రాయగడము మీద నేయుండెను. ఇంగ్లీషు వారెట్లు శివాజీతో సంధిచేయదలచిరో, యటులనే శివాజీయు ఇంగ్లీషువారితో సంధిచేయ నొప్పుకొనెను. రాజాపూరుపట్టణము ౧౬౬౧లో శివాజీ దోచినప్పుడు ఇంగ్లీషువారి యొద్దనుండి పదివేల హూనుల వెలగలవస్తువులు తీసికొనెను. ఆ ధనము త్రిప్పియిమ్మని ఇంగ్లీషువారడుగుచుండిరి. మీరు నాకు జంజిరా సాధించుటకు సహాయముచేసిన, మీధనము మీకిచ్చెదనని చెప్పుచుండెను. అప్పుడింగ్లీషువారు కేవల వర్తకు లయినందున యుద్ధములు చేయ

నొల్లక, మాకుయుద్ధములతో ప్రయోజనము లేదని తప్పించుకొనుచుండిరి. ఇట్లుభయులకును కొన్నిరోజులు సంధివిషయక చర్చ జరిగి రాజ్యాభిషేకమునకు కొన్నిరోజుల పూర్వము వారికిట్లు సంధికలిగెను:—

౧. రాజాపురములోని ఇంగ్లీషువారి దుకాణములో దీసికొనిన సొత్తంతయు శివాజీ ఇంగ్లీషువారికి ద్రిప్పి యియ్యవలయును. రాజాపురము, దాభోళ్, కల్యాణ్, పట్టణములో వర్తకమునకయి ఇంగ్లీషువారి దుకాణము లుంచుకొనవచ్చును.

౨. శివాజీ రాజ్యములో నిష్టము వచ్చినచోట, నిష్టము వచ్చినధరలకు ఇంగ్లీషువర్తకులు సరకు లమ్ముకొనవచ్చును.

3. ఇంగ్లీషువారు శివాజీకి నూటికి రెండు రూపాయల చొప్పున పన్నునియ్యవలయును.

౪. ఉభయుల నాణెములు ఉభయుల రాజ్యములలో జెల్లవలయును.

౫. ఇంగ్లీషువారియోడలు పగిలి రేవునకువచ్చిన యెడల నందలి సరకులను నపహరించక ఇంగ్లీషువారికి ద్రిప్పి యియ్యవలయును.

రాజ్యాభిషేకమైన పదునైదు దినములకు శివాజీ తల్లియైన జిజాబాయి పరలోకగత యయ్యెను. కనులార కొమారుని పట్టాభిషేకముజూచి యావీరమాత సంతోషముతో దేహమును ద్యజించె. ధన్యాత్మలగు వీరమాతలలో నీమె యొక్కతె యనుటకు సందేహములేదు.

—]:[—



## పదునాఱవ ప్రకరణము



### కర్ణాటద్రావిడ దేశములపై దాడివెడలుట

మొగలులు మరాటావారితో జేసినసంధికి విరుద్ధముగా శివాజీయొక్క రాజ్యములోని కొన్ని గ్రామములు కొల్లగొట్టినందున మొగలులతో బోరాడుటకు శివాజీకి సందుదొరకెను. ముఖ్య ప్రధానియైన మోరోపంత్ పింగళే మొగలుల రెండు దుర్గములను సాధించెను. శివాజీ జన్మభూమియయిన శివనేరిదుర్గము సాధింప యత్నించెను. గాని విఫలప్రయత్నుడయ్యె. హంబీర్‌రావు సూరత్ పట్టణమునొద్దనున్న కనుమల ద్వారా ఉత్తరదేశమునకు వెళ్ళి తన గుఱ్ఱపురౌతులను పలు దిక్కులకుపంపి బరహాణపురము వరకు దేశమును కొల్లగొట్టెను. భడోచ్ పరగణాలోనికి జొరబడి అక్కడివారిచే నప్పసంబులు గొనియె. మరాటావారు నర్మదానదిదాటి యుత్తర హిందూదేశమునకు దాడివెడలిన ప్రథమప్రసంగమిదియె. మొగలులు హంబీరరావు సైన్యమును తరుముకొని వచ్చిరి. గాని మరాటావారు వారిచేత జిక్కక నర్మదానది దాటి తమ దేశమునకు సంపాదించిన ధన మంతయు గొనిపోయిరి. ఇందులకు బదులుగా మొగలులు శివాజీయొక్క కళ్యాణ ప్రాంతమును గొల్లగొట్టిరి. (౧౬౭౧)

శివాజీకి గొంకణదేశములోనున్న రెండు రాజ్యములకు నడుమ 'పౌండ' అను మొగలుల దుర్గ మొకటి యుండెను. ఆ దుర్గమును సాధించుట యత్యావశ్యక మైనందున మరాటా వారు మూడు సంవత్సరముల వరకు దానిని సాధింప యత్నించిరి. సూరతు పట్టణములో నున్న ఫ్రెంచివారి యొద్దనుండి యందు కొరకు శివాజీ కొన్ని ఫిరంగులును, మందు గుండును గొనెను. గాని ఫిరంగిదెబ్బ లక్ష్యమునకు సూటిగా దగులనందున గుండ్లు దుర్గముపై బడవయ్యె. అప్పుడు శివాజీ స్వయముగా దాడివెడలి దుర్గసమీపమున నున్న దేశము గెలిచి, దుర్గమును నలుదిక్కుల జుట్టుకొని యుద్ధము జేసెను. దుర్గము యొక్క యొక బురుజుకు సొరంగముచేసి యందు దుపాకిమందు నింపి నిప్పుముట్టించి దానిని పడవైచి త్రోవచేసికొని లోపలికి బోయెను. మూడు సంవత్సరముల వరకును శౌర్యముతో బోరాడి తుదకు విధిలేక దుర్గములోనివారంద్రు దుర్గమును శత్రు స్వాధీనము చేసిరి. ఇట్లు దుర్గమును సాధించి శత్రురాజ్యమును దోచుకొని యపరిమిత ధనముతో శివాజీ రాయగడమును చేరెను. (౧౬౭౫)

పన్హాళా దుర్గము నొద్ద నున్న తన రాజ్యమునకు విజాపూరివారివలన మిగుల నష్టము కలుగుచున్నందున, నలువైపుల శివాజీ వర్ధనగడము, భూషణగడము, సదాశివగడము, మచ్ఛందరగడము అను నాలుగుదుర్గముల నిర్మించెను. ఈదుర్గనిర్మాణ సమయమున శివాజీకి గొప్పవ్యాధి సంభవించెను. అనేకమాసములవరకును శివాజీ వ్యాధిగ్రస్తుడై సాతారా దుర్గములోనే

యుండెను. ఇట్టి వ్యాధిలో నుండిన కాలముననే శివాజీ దక్షిణ దిగ్విజయమునకు గావలసిన సిద్ధత యంతయు జేసెను.

శివాజీ తండ్రియైన శహాజీకి తంజావూరులో జాగీరున్న సంగతి చదువరులకు జ్ఞాపక ముండవచ్చును. నారోపంతు హానుమంతే యను బ్రాహ్మణుడు శహాజియొద్ద మంత్రిగానుండి యీజాగీరు పని చూచుచుండె. ఆతఁడు ౧౬౫౩ లో గతింపగా, నాతనికుమారుడైన రఘునాథనారాయణ అనువాడు మంత్రిత్వమును వహించె. ఈతడు వైదిక లౌకిక వ్యవహారము లందు ప్రవీణుఁడు. శహాజీ మరణానంతరము ఆతనిద్వితీయభార్య పుత్రుడైన వెంకాజీయనునాతఁడా జాగీరునకు నధిపతి యయ్యెను. గాని శివాజీవలె నాతనితమ్ముడైన వెంకాజీ తెలివి తేటలు గలవాడు కానందునను, నీచులమాటలు విని ప్రమత్తుడై యుండువాడైనందునను మంత్రియైన రఘునాథ నారాయణునకును నాతనికిని మనస్పర్థ కలిగెను. మంత్రి చెప్పిన మంచి యాలోచనలు వినక, రాజాతని నవమానపరచుచున్నందున నవమానమును సహింపలేని బ్రాహ్మణతేజస్సు గల యా మంత్రి రాజుపై బగసాధింప నిశ్చయించెను. కాని చుట్టుపట్టుననున్న పాళేగారుల నాశ్రయించి వారిచే దనదొరను భంగపరిపించిన నది స్వామిద్రోహ మగునని యెంచి, తనరాజునకు నన్నయైన శివాజీని నాశ్రయించి యాతనిచే దమ్మునికి బుద్ధిచెప్పింప వలయుననినిశ్చయించెను. తనవంటి సరదారుడు శివాజీవంటి మహారాజును జూడబోవునప్పుడు రిక్తహస్తములతో వెళ్ళగూడదని తలచి, జింజీమొదలైన కొన్నిదుర్గముల

యధిపతులతో శివాజీకి బోరాటగలుగు కారణంబుల గొన్ని టిని యోచించుకొని గోలకొండకు బోయె అప్పుడక్కడ నాంధ్ర దేశంబున దమ యుజ్జ్వలకీర్తి శాశ్వతముగా నిలిపిన వారును, ఇంగ్లీషు, ఫ్రెంచి మొదలగు పరదేశస్థులప్పుడు బలతో దమ్ము నాశ్రయించు నంత యోగ్యత గలవారును, అశ్వినేయులవలె నెల్లప్పుడును దంటగా నామ ముచ్చరింప బడు సద్వితీయానుకరణీయులను నన్నదమ్ములను నగు అక్కన్న మాదన్న గార్లు ముఖ్యమంత్రిత్వమును వహించియుండిరి.

గోలకొండనవాబు ౧౬౭౨ లో గతింపగా, నాతని యల్లుడైన అబూహుసేన్ * అనువాడు నవాబయ్యెను. పూర్వ వయస్సునందీతడు సత్ప్రవర్తన దప్పిన వాడయినను, రాజ్యము వచ్చినప్పటినుండియు జన్మాంతర మెత్తినటుల సజ్జను డయ్యెను. తనయొద్దనున్న వారి గుణమును పరీక్షించుటయందు నీతడు ప్రజ్ఞానిధి యైనందున, దుర్మార్గప్రవర్తనగలవానిని తొలగించి బుద్ధియందు బృహస్పతిబోలిన అక్కన్నమాదన్న గార్లకు మంత్రిత్వమిచ్చె. సాధారణముగా నుభయుల పేర్లు వాడుకలో నున్నను, మాదన్న పంతులవారే ముఖ్యప్రధాని యై యుండె. ఆయనమాట 'తానీషా' జవదాట డయ్యె;

తంజావూరునుండి బయలుదేరి గోలకొండకువచ్చి రఘునాథనారాయణ అను మంత్రిపుంగవుడు మాదన్నగారిని

* ఈతనికే 'తాన్‌షహా' అని నామాంతరము. 'తానీషా' అని ఆంధ్ర దేశమున వాడుక.

చూచి, తన యప్రతిమపాండిత్యమును, అసమాన రాజ్యతంత్ర చాతుర్యమునుజూపి యాతనిని వశపరచుకొనియె. శివాజీయు, గోలకొండ నవాబును గలసి దాడివెడలిన గర్ణాట ద్రావిడ దేశములలోని విజాపూరువారి రాజ్యమంతయు సాధింపవచ్చునని యక్కన్నగారికి నమ్మిక పుట్టునటుల జెప్పి యాతనిచేత నవాబునకు జెప్పించె. అందులకు సమ్మతించి నవాబు రఘునాథనారాయణుని తనసభకురావించి గౌరవించి కర్ణాటముపై శివాజీతో దాడివెడలుటకు దన కిష్టమున్నది యని తెలిపెను. ఇట్లు రఘునాథనారాయణుఁడు యుద్ధముచేసి రాజ్యము గలిచెదవురమ్మని శివాజీని పిలుచుటయేగాక, గోలకొండ సైన్యముల నీకు సహాయమిచ్చెద పట్టు మనుచు శివాజీయొద్దకు వచ్చెను. అందులచేనాతని యసామాన్యప్రజ్ఞకు మెచ్చి శివాజీ గుఱుతుసు రాయగడమునకు రాగానే యాతనికి దన యమాత్యుని పని యిచ్చెను.

కర్ణాటద్రావిడదేశములపై దాడి వెడలుటకు గారణ మెద్దియని వెల్లడిచేయవలయునో యని యాలోచింపగా, తండ్రియైన శహాజీయొక్క జాగీరంతయు నాతని ద్వితీయపుత్త్రుఁడగు వెంకాజీ యనుభవించుచున్నాడనియు, జ్యేష్ఠపుత్త్రుఁడైన శివాజీకి నేమియు, నిచ్చుట లేదనియు, నందునకు శివాజీ తన సగముభాగము తమ్మునియొద్దనుండి తీసికొనుటకు దంజావూరుకు పోవుచున్నాడను మిషపెట్టుకొని, దాడికి బయలు దేరవచ్చు ననియు నిర్ణయించిరి.

తాను దూరదేశమునకు బోయినప్పుడు మొగలులు తన రాజ్యముమీదికి యుద్ధమునకు వచ్చెద రేమో యని తలచి శివాజీ మొగలసేనాధిపతిని వశపరచుకొని తాను ఢిల్లీశ్వరునికి సామంతునిగా నుండుదు ననియు, గొంత కప్పము కట్టెద ననియు వర్తమాన మాతనిద్వారా ఔరంగజేబున కంపి, మొగలులతో గొంతస్నేహభావము కుదుర్చుకొనెను. జంజిరాకు నధిపతియైన సిద్దీవాడు తన కొంకణప్రాంతముకు బాధ కలుగచేయకుండ నక్కడనొక గొప్పసైన్య ముంచెను. ఢిల్లీకి బయన మయినప్పుడు చేసినటుల నిప్పుడును రాజ్యమంతయు ముఖ్యప్రధానియైన మోరోపంతుపింగళేగారి స్వాధీనము చేసెను.

ఇట్లు స్వరాజ్యసంరక్షణమునకు గావలసిన కట్టుదిట్టములన్నియు నేర్పరచి, ముప్పదివేల యశ్వసైనికులను, నేబదివేల కాల్బలములను దీసికొని దాడివెడలెను. తానువచ్చుచున్న సమాచారము గోలకొండ నవాబయిన తానీషాకు దెల్పుటకై చారుల బంపెను. 'గోలకొండ రాజ్యములోని ప్రజలకు నేమాత్రము బాధ కలుగజేయగూడ దనియు, సైనికులకు గావలసిన వస్తువు లన్నియు డబ్బుపెట్టి కొనవలసిన దనియు నాజ్ఞాపించెను. గోలకొండసమీపమునకు రాగానే మాదన్నగారెదురుగావచ్చి శివాజీని తీసికొనిపోయి నవాబుదర్శనము చేయించిరి. నవాబునకును శివాజీకిని మైత్రిగలిగి శివాజీనెల రోజులవరకును గోలకొండలోనే యుండెను. ఢిల్లీపతియు విజాపూరునవాబునుగూడి మనలనిద్దరును నాశముచేయ యత్నించు

చున్నారనియు,మనమిద్దరముసఖ్యముతో నుండిస్వసంరక్షణము చేసికొనవలయు ననియు, శివాజీ నవాబునకు జెప్పగా వారికిద్దరకు నిట్లు ఒడంబడికలు జరిగెను. ద్రావిడకర్ణాటకదేశయుద్ధమునకై శివాజీ తన సొంతసైన్యమును, నవాబు యొక్క ఫిరంగులను దీసికొని పోవలయును. మొగలులు గోలకొండమీదికి గాని, శివాజీరాజ్యము మీదికిగాని దండెత్తివచ్చినయెడల వారిని నవాబు యెదిరింపవలయును. క్రొత్తగా శివాజీ సంపాదించు రాజ్యములో సగభాగము గోలకొండ నవాబునకు నియ్యవలయును. వీలయినప్పుడు విజాపురము తురక దివానును దొలగించి అక్కన్నగారికి ఆ దివానుగిరి యిప్పింపవలయును. ఇట్లొడంబడిక లేర్పరచుకొని శివాజీ కర్ణాట ద్రావిడదేశములపై దండు వెడలెను. (౧౬౭౭ మార్చి)

గోలకొండ బయలుదేరి కడప, కర్నూల్ మొదలయిన ప్రదేశములలో నప్పనంబులు గొనుచు నివృత్తిసంగమక్షేత్రమున స్నానముచేసి, తనసైన్యములన్నింటిని జంజి మార్గమున తిన్నతిన్నగా బోవుచుండు మని యాజ్ఞాపించి, తాను కొలది సేవకుల వెంటదీసికొని శ్రీశైలమునకుబోయి మల్లిఖార్జునుని సేవించెను. ఆ రమ్యమైన పర్వతప్రదేశములను జూచి యచ్చటనే జన్మమంతయునుండి తపస్సు చేసుకొనవలయు నని శివాజీకి దలంపు గలిగెను. అచ్చటి భవానీదేవికి దనశిరః కమలము సమర్పించి ముక్తిని జెందవలయు నని నిశ్చయించె నట! కాని, శరీరమందు దేవిప్రవేశించి నీవీపని చేయవలదు. నీవు చేయవలసిన కార్యములనేకములున్నవి. నీవు యుద్ధమునకు వెళ్ళుము.

అని యజ్ఞాపించెనట! ఆత డచ్చటనుండి బయలుదేరి చెన్న పట్టణము మీదుగా జింజీకి బోయి యాదుర్గము సాధించి, యచ్చట రామజీనలగె అనువానిని హవాల్ దారుగా నేర్పరచెను. తరువాత ఆప్రాంతములోని దుర్గములు, కోటలు, ఠాణాలు మొదలయిన వన్నియు గెలిచి, యచ్చట దన సుబేదారునుంచె. మహారాష్ట్రదేశము నందలి దుర్గములను గాపాడుటకు జేసిన నియమముల నిచ్చటి దుర్గముల రక్షణార్థమై యేర్పరచెను. తన దేశములోని జమాబందిపద్ధతుల ననుసరించియేక్రొత్తరాజ్యము లోని భూమి యమరకము గురించి కట్టుదిట్టము లేర్పరిచెను.

ద్రావిడదేశములోని తమరాజ్యము మారాటావారి చేతిలో బడుచున్నదని చూచి, విజాపూరువారు గొప్పసైన్యమును శివాజీమీదికి బంపిరి. శివాజీ యాసైన్యమును నోడించి సైన్యాధిపతిని ననేక ధనధాన్యవస్తువాహనములతో జెరబట్టెను. శివాజీవెంటనున్న సరహరిబల్లాలుడను నొక సేనాని వేలూరు పట్టణమును ముట్టడించి, సమీపమందున్న రెండుగుట్టలమీదికి ఫిరంగుల నెక్కించి అచ్చటినుండి పట్టణముమీదికి నగ్నిగోళముల జల్లుచు గొన్నిరోజులకు బట్టణంబును సాధించెను.

శివాజీ తండ్రియగు శహాజీకి దాసీపుత్రుడగు సంతాజీ రాగా నాతని గౌరవించి యాతనియందు దనతండ్రి గుణంబు లనేకము లున్నవని చూచి, శివాజీ యాతని జింజీకి నధికారిగా నియమించెను. తరువాత శివాజీ తన సాపత్న్యసోదరుడైన వెంకోజీకి నిట్లు వర్తమానమంపెను. 'మనతండ్రిగారు గతించి పదుమూడు సంవత్సరములు అయినవి. పూర్వార్జితమైన తంజా

వూరు మొదలయిన జాగీర్లును, నగలు నాణెములను నీవే యనుభవించుచున్నావు. మాసగపాలుమాకియ్యవయితివి. ప్రస్తుతము మేమిటునైపులకు వచ్చియున్నాము గాన, మాభాగము మాకియ్యవలసినది. తిరువేదీయొద్ద వచ్చి మమ్మును గలిసికొనవలసినది."

శివాజీ తనరాజ్యములోని సగభాగము తీసుకొనుటకు వచ్చినాడని వెంకోజీకిని యిదివరకే తెలిసినందున నాతడు యుద్ధమునకు సిద్ధముగా నుండెను. గాని, యాతనికి సహాయముగా వచ్చెద ననిన పాళేగారులు కొందరు శివాజీకి లోబడినందున వెంకోజి యన్నను జూడబోవలసినవాడయ్యెను. వచ్చిన తన తమ్ముని శివాజీ గౌరవించి కొన్ని రోజులుతనయొద్ద నుంచుకొనెను. వెంకోజి పైకి నమ్రభావమును జూపినను భాగమిచ్చుటకు సమ్మతింపడయ్యె. తమ్ముని జెరబెట్టి యర్థరాజ్యము తీసికొనవలయునని శివాజీ యోజించెను. కాని తాను పిలువగా నమ్మివచ్చినవానిని మోసపుచ్చగూడ దని తలపు ఆతనిని పోనిచ్చెను. పోయినపిదప నొక దూతను నాతనియొద్దకు బంపి గృహకల్లోలము పెంచినందున లాభములేదు. గాన ధర్మమును స్మరించి పితృధనముయొక్క యరపాలు మాకిమ్ము. ఈ చిన్నజాగీరు నారాజ్యములో నూరవవంతయినను లేదు. అయినను పూర్వార్జితమునైన భూమిని బోగొట్టుకొనుట తెలివిమాలినతనము అనబడును' అని వారపంపెను. కాని, వెంకోజి యందులకు సమ్మతింపడయ్యె. త్రివేదీనుండి శివాజీ వేలూరు మీదుగా మహారాజగడము, కర్ణాటకగడము అనుదుర్గముల

మీదికి బోయి వానిని సాధించి, కోలార్, బాలాపురము మొద లయిన ప్రాంతములలోని పాళెగారులను వశపరచుకొని ఆర్నికి వెళ్లెను. వేదోభాస్కర్ అను బ్రాహ్మణ సరదారు డచ్చటి గుర్గమునకు అధిపతిగా నుండెను. ఆతడు మిక్కిలి తెలివి తేటలు గలవాడు. శివాజీ తండ్రియగు శహాజిచే నీ సరదారు డచ్చట నిలుపబడియె. ఆతడు శివాజీకి శరణురాగా నాతని సధికార మాతనికే యొసంగబడియె. ఆతని యిద్దరు కుమారులకు శివాజీ తనయొద్ద నుద్యోగముల నిచ్చె. ఇట్లు శివాజీ తనతండ్రి యైన శహాజిచే సంపాదింపబడిన జాగీరులోని కోలార్, బసవ కోట, బెంగుళూరు, బాలాపురము, సేరా, మొదలయిన ప్రాం తములను గెలిచి విజాపూరువారి రాజ్యములో నప్పనంబులు గైకొనుచు గరభారమియ్యని గ్రామములను గాల్చ బేల్చ దొడంగె (౧౬౭౭ డిశంబరు)

శివాజీ యిటు కర్ణాటకదేశమునకు వెళ్లినాడని చూచి యిదియె సమయ మని యెంచి మొగలులును విజాపూరు వారును గూడి గోలకొండమీదికి దండు వెడలిరి. ముందిట్లగు నని దీర్ఘాలోచనవలన గనుగొనినవా డగుటచే మాదన్న గారదివరకే శత్రువులను నెదరించుటకు సిద్ధముగా నుండిరి. అందుచే శత్రువునకు వస్తుసామగ్రి దొరకకుండ జేసి యెన్నియో బాధలు పెట్టి శత్రువులను బారగొట్టిరి.

విజాపుర సైన్యములోని కొందరు సైనికులకు ముట్టవల సిన జీతము ముట్టనందున వారు అలిగి మోరోబంత్ పింగళే యొద్దకువచ్చి మరాటావారి సైన్యములో జీతమునకుండిరి.

గోలకొండమీదికి మొగలులు దండెత్తివచ్చినారన్న వృత్తాంతము విని, శివాజీ ద్రావిడదేశమునుండి బయలుదేర నిశ్చయించె. క్రొత్తగా సంపాదించిన జింజీరాజ్యమంతయు దనతమ్ముడయిన సంతాజీ (శహాజీదాసీపుత్రుడు) కిని, రఘునాథనారాయణునికిని నప్పజెప్పి వారికి సహాయముగా గొప్ప సైన్యముతో హంబీరరావును ప్రాంతమంతయు శాంతిపొందు వరకు నిచ్చి మిగిలిన సైన్యములతో దాను స్వదేశమునకు రాజొచ్చెను. బళ్లారిలో మలబాఈదేసాఈణ్ అను దేశముఖి శివాజీతో ఘోరముగా బోరాడి యిరువదియేడు దినముల వరకును దుర్గములోనికి మరాటావారిని రానియ్యదయ్యె! తుదకు మరాటావారు దుర్గమును సాధించిరి. తరువాత కోపల్ బహాదుర్ వెండా అను పట్టణముల గెలిచిరి. ఈ ప్రాంతముల కన్నిటికిని జనార్దనపంత్ అనువానిని నధిపునిగా నేర్పరిచి శివాజీ తురగళపట్టణములో విడిసియుండగా, గర్ణాటక ద్రవిడ దేశములలోని తన సైన్యాధిపతులతో దనతమ్ముడైన వెంకోజీ యుద్ధముచేసి, పరాజితుడయ్యెననిన వార్త శివాజీకి దెలిసె. అప్పుడాతడు తన తమ్మునకిట్లు వార్తపంపెను. 'మీరు మాకు పితృధనములోని పాలియ్యనందున మీ రాజ్యములోని కొంత భాగము మేము గెలువవలసివచ్చెను. మీరు మా సైనికులతో బోరాడితిరి గనుక, మా సైనికులును మీతో బోరాడవలసిన వారైరి. మీరు దుష్టులమాటలు విని సన్మార్గమును వదిలి దుర్మార్గమున బోవుట మంచిది కాదు. మీకును మాకును జరగిన యుద్ధములో బడిన తురకలను గురించి నాకేమియు

జింత లేదు. కాని, ప్రతాపజీరాజా, భీమాజీరాజా శివాజీపంత్ డబీర్ మొదలయిన మా శూర మరాటావీరులు పడిసందులకు మే మెంతయు జింతిల్లుచున్నాము. ఇట్లు చేయక యూరు మేము కలసి మెలసి యుండిన నుభయులకు క్షేమమే. మేము చెప్పి నటుల మీరు విని కర్ణాటకములోని రాజ్యమంతయు మాకిచ్చి వేసిన యెడల మరల నింతరాజ్యము మీకు పన్హాళాయొద్ద నివ్వగలవారము. మీకిష్టమున్న యెడల గుతుబుశాహి (గోల కొండ) రాజ్యములో మూడులక్షలహొనుల రాజ్యమిప్పింప గలము.' ఈ వార్తయందిన తరువాత వెంకోజీ తెలివి తెచ్చు కొని తా నపరాధము చేసినను సమర్థుడయ్యును దనయన్న తన్ను నన్యాయముచేయక కొంతరాజ్య మిచ్చెదనని యను చున్నందులకు సంతసించి, సంధిచేసుకొనుట కిదియే మంచి సమయమని తలచి, రఘునాథనారాయణుని ద్వారా తంజా వూరును, శహాజీ జాగీరును దనస్వాధీనములోనే యుండు నట్లును దాను బ్రతిసంవత్సరము శివాజీకి జాగిరులో వచ్చు నాదాయములో సగమిచ్చునట్లును శహాజీ సంపాదించిన చర రూపకమయిన యాస్తియంతయు నుభయులు పంచుకొను నట్లును నొప్పుకొని శివాజీతో సంధిచేసికొనెను.

విజాపూరు సైన్యము శివాజీ రాజ్యములోని భాగమైన పన్హాళాప్రాంతములోనికి జొచ్చి, గ్రామములను గొల్లగొట్టెను, ఈ వార్త స్వదేశమునకు దిరిగివచ్చుచున్న శివాజీకి దెలియగా. నాతడు నిరోశికాటకర్ అను నాతనికి సైన్యమిచ్చి శత్రువుల మీదికి బంపెను. వాడు శత్రువుల నోడించి వారు దోచుకొని

పోవుచున్న ధన మంతయు దెచ్చి శివాజీకి సమర్పించెను. శివాజీ యా ధనమెవ్వరిదియైనది కనుగొని, యెవ్వరి ధనము వారికి నిప్పించి తన న్యాయప్రియత్వమును వెల్లడి పరిచెను.

బల్లారి ప్రాంతమునకు జనార్దనపంత్ అను వానిని నధికారిగా నేర్పరచినట్లు వెనుక వ్రాసియున్నాను. ఆ జనార్దన పంతులు మీదికి విజాపురసరదారు లిద్దరు దండెత్తివచ్చుచున్నారని శివాజీకి దెలిసినందున, దన సేనలో గొంతభాగము జనార్దనుని సాయమునకు బంపెను. మిగిలిన సైన్యములతో దా [illegible]ములుచేరిన పదునెనిమిది నెలలకు దిరిగి రాయగడము చేరెను. అటు జనార్దనపంతును, హంబీరరావును గూడి విజాపూరు సరదారుల గెలిచి వారిని తరిబట్టిరి. మరాటావారికి నెనుబూర్ల గుర్రంబులు, నేనుగులును దొరకెను. తరువాత జనార్దనపంతు నప్పటపట్టున నున్న పాళెగారుల నాదరను గెలిచి శివాజీ సామంతుల మని వారిచే నొప్పించెను. మరాటావారి నెదిరించు శక్తిలేక విజాపూరు వారూరకుండిరి.

శివాజీ దక్షిణ దిగ్విజయము చేసి రాగానే మాదన్న గారు రాయగడమునకు దూతలద్వారా వస్త్రభూషణ రత్న మాణిక్యాదులు కానుక లంపిరి.

తాను క్రొత్తగా సంపాదించు రాజ్యములో సగపాలు గోలకొండ నవాబున కిచ్చెదనని శివాజీ సంధిచేయు నప్పుడొప్పుకొనెనని చదువరులకు జ్ఞాపక ముండవచ్చును. శివాజీ కర్ణాట దేశములో సంపాదించిన క్రొత్తరాజ్యములోని యర్థ భాగము ఆ సంధి ననుసరించి గోలకొండ నవాబునకు నిచ్చి

నటుల గానరాదు. ఇందులకు గారణమేమో తెలియదు. మరి యే విధముననో నవాబును, మాదన్న గారిని సమాధాన పఱచి యుండును. అట్లు సమాధాన పరుపనియెడల నవాబును మాదన్న గారును శివాజీతో నాతని మరణము వరకును సఖ్యముతో నుండుట సంభవింపదు. ఈసంగతి యాలోచింపక యింగ్లీషు చరిత్రకారులు శివాజీ నవాబును నన్యాయముగా మోసపుచ్చెనని వ్రాసియున్నారు. కాని, వారి వ్రాత లెంత మాత్రము నమ్మఁదగినవి కావు.



★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★

## పదునాలుగవ ప్రకరణము



### అస్తమయము

ఔరంగజేబు విజాపురమువారితో మైత్రి చేసి చేసి తుదకు వారిరాజ్యమును సహరింపవలయు ననెడు దుర్బుద్ధి కలవాడై శత్రుభావమును వహించి దిలేర్ ఖానుఅను సైన్యాధిపతిని విజాపురము మీాదికి బంపెను. విజాపుర రాజ్యమునకు మంత్రియైన మసావుద్ ఖానునకు ఈ వృత్తాంతము తెలిసినందున నేమియు జేయుటకు దోపక, యాతఁడు శివాజీయొద్దకు దూతను బంపి సహాయము వేడెను. అందులకు శివాజీ యిట్లు ప్రత్యుత్తర మంపెను. 'మేము మొగలులతో ప్రత్యేకముగా బోరాడిగాని, లేక వారిరాజ్యములో గ్రామములను గొల్లకొట్టిగాని, వారు మీాతో యుద్ధముచేయుట మాని తిరిగి వచ్చునటుల జేసి మీాకు సహాయము చేయుదుము, మీారు భయపడవలదు.'

వెంటనే శివాజీ పన్హాళా యొద్ద గొప్ప సైన్యమును గూర్చుకొని విజాపురమునకు బయలుదేరెను. గాని కొంత దూరము పోయిన తరువాత మొగలుల ప్రచండసైన్యముతో దన చిన్నసైన్యము నిలిచి పోరాడ జాలదని తలచి, దౌలత్తాబాద్ చాత్నా మొదలయిన గ్రామములను దోచుకొన

బోయిన మొగలులు విజాపూరు ముట్టడి విడిచి స్వరాజ్య రక్షణార్థమై వచ్చెదరని యెంచి, శివాజీ యటు తిరిగెను. భీమానదిదాటి గోదావరినది వరకు మొగలుల రాజ్యమంతయు గొల్లగొట్ట సాగెను. ఈ వార్త మొగలుల సేనాధిపతి యగు దిలేరుఖానునకు దెలిసినను నాతడు విజాపూర్ ముట్టడి విడిచి రాడయ్యె. అందుపై శివాజీ గోదావరీనది దాటి జార్నాకు బోయి యా పట్టణ సమీపమందున్న ఔరంగబాదులో బాదుషాకొమారుడయిన మోఆజీం ఉన్నప్పటికి భయము లేక యా పట్టణమును మూడు దినములవరకును దోచుకొనెను. పట్టణములోని ధనము గలస్థలములన్ని యుద్రవ్వించి యపార సంపత్తిని వడసెను. ఆ ధనమంతయు దీసికొని పోవుచుండగా మొఆజీం పదివేల సైన్యమును మరాఠా వారి మీదికి బంపెను. సంగమనెర్ వద్ద నుభయ సైన్యములకు ఘోర యుద్ధంబు జరిగె. సంతాజీ ఘోరపడె అను సేనాని తొందరపడి మొగలుల మీదికి నకాలముననే పోయినందున పరాజితుడై వెనకకు రావలసిన వాడాయెను. తన సైన్యములు వెనుకకు వచ్చుట చూచి శివాజీ 'యోడకుడి ఓడకుడి' అని పలుకుచు తనయొద్ద నున్న సైనికులను వెంట దీసికొని వెనుక నుండి ముందు వచ్చి మోఆజీం వచ్చుచున్న కనుమయొక్క ద్వారము నొద్ద గొప్ప సైన్యముతో వేచియుండెను శత్రు సైన్య మెచ్చుట జూచినను చిన్న చిన్న గుంపులు గుంపులు గూడి యధికము గాజొచ్చెను. ఇక శత్రువుల చేతినుండి తప్పించుకొనుట యెటులనని శివాజీ విచారించుచుండగా

నా పర్వత ప్రదేశములు బాగుగ నెరింగిన యొక మార్గదర్శి మరాటా సైన్యములను మారు త్రోవం దీసికొనిపోయి శత్రువులకు తెలియకుండ పటాయను దుర్గమునకు జేర్చెను. చేత జిక్కిన పులి దప్పించుకొనిపోయెను గదా యని హతాశులై మొగలులు ఔరంగబాదు మరలి పోయిరి. అంత శివాజీ మోరోపంతుపేష్వాను బిలిపించి పటాసమీపమున నున్న యితర దుర్గములను సాధింపు మని చెప్పగా నాతడు నిరువదియారు క్రొత్తదుర్గములను సంపాదించెను.

శివాజీ పటా దుర్గముమీద నుండగా విజాపూర్ మంత్రి యగు మసాఊద్ ఖానుని యొద్దనుండి ఇట్లు వర్తమానము వచ్చెను. 'మా పట్టణ మింకను దిలేరుఖానుడు ముట్టడించి యున్నాడు. పంతము వేసికొని ముట్టడి లేపడయ్యె. ఇప్పుడు మీరన్యవిచారము చేయక వచ్చి మమ్ము గాపాడ వలయును'. ఈ వార్త యందినతోడనే శివాజీ విజాపురమునకు బయలు దేరెను. కాని త్రోవలో నాతనికి దన కుమారుడైన సంభాజీ పారిపోయి మొగలుల సైన్యములోనికి వెళ్ళి దిలేర్ ఖానుని నాశ్రయించియున్నాడనిన దుఃఖవార్త తెలిసినందున, నాతడు సైన్యమిచ్చి హంబీరరావును విజాపురమునకు బంపి తాను బన్హాళా దుర్గమునకు పోయెను.

శివాజీకి నిద్దరు భార్యల వలన నిద్దరు పుత్రులు పుట్టిరి. పెద్దభార్యయగు సయీబాయివలన సంభాజీ; చిన్నభార్యయగు సోయెరాబాయి వలన రాజారాము. వీరిద్దరు తాను స్థాపించిన మహారాష్ట్రమును గాపాడి, గోబ్రాహ్మణ సంరక్షణము చేసి

హిందూమతమును స్థాపింపవలయునని యిచ్ఛగలవాడై శివాజీ తన కుమారులకు సద్విద్యగరప యత్నించెను. వ్రాతయు చదువును మల్లవిద్యయు, నశ్వారోహణంబును బాణ సంధాన ప్రకారంబులును, శస్త్రయుద్ధంబును వారికి నేర్పెను. ఉత్తమ వృద్ధసేవకుల యొక్కయు, శ్రేష్ఠ పండితుల యొక్కయు సహవాసములో వారిని నుంచెను. సజ్జన సహవాసమే చేయవలయును. నీచులను, దుష్టులను దుర్వ్యసనము గలవారిని నొద్ద జేరనియ్య గూడదు. వానివలన గులమును రాజ్యంబును నాశము జెందునని బోధించుచు, రావణ దుర్యోధనాదికుల కథలను కుమారులకు జెప్పుచుండెను. వారికి వ్యవహారము తెలియవలయునని వారిని దనవెంట బేరోలగమునకు దీసికొని పోవుచుండెను. కాని, ఈ పరిశ్రమయంతయు పెద్ద కుమారుడైన సంభాజీయందు నిరర్థకంబయ్యె. ఈరాజపుత్రుడు పుట్టినప్పటి నుండియు క్రూరుడు మూర్ఖుడును అయియుండె. ఈతడు రెండుసంవత్సరముల వయస్సు గలవాడై యున్నప్పుడితని తల్లి ౧౬౫౯ లో మృతి జెందినందున, జిన్ననాటినుండియు నొకరి యాజ్ఞలో నుండక తుదకు దండ్రినిగూడ నతిక్రమింప జొచ్చె. ఒకనాడు రాజ భవనమందు పేరంటమునకు ననేక స్త్రీలు రాగా సంభాజీ యొక బ్రాహ్మణ వనితను బలాత్కారముగా స్పర్శించెను. బ్రాహ్మణులను దేవతలవలెను, పరస్త్రీని తల్లివలెను జూచినట్టి శివాజీకి ఈ వార్త తెలియగా నాతడు మిక్కిలి కోపగించి 'పూర్వజన్మమున నేమిపాపము చేసినందు

ననో యిట్టిపుత్రుఁడు గలిగెను; పుత్రుఁడైననేమి కఠినముగా శిక్షించెద' నని పలికెను.

తండ్రి తన్ను గఠినముగా శిక్షించు నని యెంచి సంభాజి కొందఱు సేవకులను వెంటఁదీసికొని మొగలుల సైన్యాధిపతి యైన దిలేరుఖానుని యొద్దకు వెడలిపోయెను. తమశత్రువైన శివాజీయొక్క కుమారుఁడు తండ్రితోఁ బోరాడి తనయొద్దకు వచ్చినందులకు దిలేరుఖాన్ సంతసించి సంభాజిని గౌరవించి యాతనికి గొప్ప వేతనమేర్పరచి తనయొద్దనుంచుకొనెను. సంభాజిని మరాటావారికి రాజుగా నేర్పరచి మరాటావారిలో వారికి నంతఃకలహములు కలుగునటుల జేసి శివాజీ నోడింపవలయు నని యా దిలేర్‌ఖాను తలచి, సంభాజికి మరాటావారి రాజని పేరుబెట్టి, కొంతసైన్య మిచ్చి సంభాజిని మరాటావారిదుర్గ మగు భూపాలగడము గెల్చుటకు బంపి యీవార్త నౌరంగజేబునకు దెలిపెను. సంభాజి భూపాలగడమును ముట్టడించి యుద్ధము చేయ సాగెను. పోరాటకు వచ్చిన సంభాజి తమరాజునకు బెద్దకొడుకైన సందున నాతనితోఁ బోరాడి యాతని నొప్పించిన శివాజికి నేమి కోపము వచ్చునో యని తలచి దుర్గములోనివారు దుర్గమును విడిచివెళ్ళిరి. రెండవదినము సంభాజి దుర్గములోనికి నెక్కి యక్కడ నున్న కొలది జనంబుల బట్టి కొందర కాళ్ళును, గొందర చేతులును నరకించెను. ఇట్లు దుర్గము స్వాధీనమైన తరువాత గూడ దన క్రూరత్వమును జూపి సంభాజి దిలేరుఖానుని యొద్దకు బోయెను. అటు శివాజీ పన్హాళాగడము చేరి యొకదూతను దన

పుత్రునియొద్దకు బంపి యిట్లు చెప్పించెను. నేనుజన్మమంతయు గష్టపడి సంపాదించిన రాజ్యమంతయు మీకొరకు గాక మఱి యెవరికొరకు! మాకు దినదినము వార్ధక్యము వచ్చు చున్నది. ఈరాజ్యమంతయు బాలించు భారము మీది. అటుల జేయక శత్రువులలో గలసి మనరాజ్యము శత్రువుల కియ్యవచ్చునా! మొగలులను విడచి వచ్చినయెడల మీఖర్చు నిమిత్తము మీరడిగిన తాలూకా యియ్యగలము,"

అటు విజాపురమువారికి సహాయముచేయుటకు హంబీర రావు వెళ్లుచుండగా నాతనిని మొగల సరదారుడగు రణ మస్తఖాన్ తొమ్మిదివేల గుఱ్ఱపురౌతులతో నెదిరించెను. మరాటా వారిచే బరాభూతులై మొగలులు నలుదిక్కులకు బారిరి.అంత హంబీరరావు దిలేర్ ఖానుని సైన్యములకు నెచ్చట నుండియు వస్తుసామగ్రి చేరకుండ జేసెను. అందుచే మొగలుల శిబిరములో రూపాయికి నరసేరు ధాన్యమైనను దొరకక పోయెను. గుఱ్ఱములు ఏనుంగులు మేతలేక చావజొచ్చెను. అయినను దిలేర్ ఖానుడు ముట్టడిలేవడయ్యె. తుదకుధాన్యపు గింజ యొకటియు లేదని తెలిసి దిలేర్ ఖానుడు ముట్టడిలేపి దేశము దోచుకొనుటకు గర్ణాటమునకు వెళ్ళెను. కాని కర్నా టకములో శివాజీ యుంచివచ్చిన జనార్దన్ పంతు దిలేర్ ఖానుని పరాభవింపగా నాతడు తననివాసస్థలమునకు బోవలసిన వాడాయెను. (౧౬౭౯)

మారాటావారికి దక్షిణమున నెక్కడజూచిన నక్కడ జయము కలగినటుల నుత్తరమునను గలిగెను. ఖానదేశములో మోరోపంతు పేష్వా అనేక దుర్గములను సాధించెను.

తండ్రిచే బంపబడిన చారుడుచెప్పిన మాటలవలన బుద్ధితెచ్చుకొని, సంభాజి మోగలుల శిబిరముననుండి గుప్తముగా వెడలి తండ్రియొద్దకు వచ్చెను. వచ్చిన కుమారునకు శివాజీ యెన్నియో బుద్ధులుచెప్పి యాతని నెక్కడికి బోనియ్యకుండ పన్హాళాదుర్గముపై భద్రముగా నునిచి తాను రాయగడమునకు వెళ్ళెను. (౧౬౭౯)

మోగలులు విజాపురమును ముట్టడించినప్పుడు శివాజీ చేసిన సాహాయ్యమునకై మసాఉద్ ఖాన్ శివాజీకి కోసల ప్రాంతమును బళ్లారిప్రాంతమును నిచ్చివేసెను. మఱియు ద్రవిడదేశములోని తంజావూరు ప్రాంతమునకును శహాజి సంపాదించిన జాగీరునకును స్వామిత్వము శివాజీ నిచ్చెను. శివాజీకిని విజాపురమువారికిని నప్పుడు గొప్ప సఖ్యముజరగి శివాజీ విజాపురమునకు వెళ్ళినప్పుడు మసావుద్ ఖాన్ స్వయముగా నెదురు వచ్చి యెంతయు గౌరవించెను, (౧౬౭౮)

తంజావూరు ప్రాంతముయొక్క స్వామిత్వము శివాజీకి గలిగినందున నాతనితమ్ముఁడగు తంజావూరు రాజయిన వెంకోజీ శివాజీకి సామంతుడయ్యెను. ఇట్లగుట వెంకోజీకి నిష్టము కానందున నాతనికి హృద్రోగము గలిగెను. ఇదియు గాక శివాజీని వెంకోజీమీఁదికి దీసికొని వచ్చిన రఘునాథ నారాయణుడు శివాజీచే నచ్చట నధికారిగా నియమింపబడినందున

నాతనికి వెంకోజీకిని నెప్పుడును నేదియో కలహము కలుగు చుండె. ఈ కలహము శివాజీయొద్దకుబోగా నాతనికి రఘు నాధనారాయణుని మాటలే నిజమని తోచుచుండె. అందుచే వెంకోజీకి తాను పేరికి రాజునని తోచి యౌదాసీన్యము గలిగెను. ఆతడు రాజ్యకార్యములను జూడక ఉదాసీనవృత్తి గల వాడైయుండె. ఈ వార్త తెలిసి శివాజీ తన తమ్మునికి బోధ ప్రదంబయిన యీ క్రిందియుత్తరంబు బంపె:-

"వ్రాయుటకు గారణమేమనగా బహుకాలమునుండి మీయొద్దనుండి యుత్తరము వచ్చినదికాదు. అందుచే మాకెంతయు జింతగానున్నది. రఘునాధపంతువ్రాసిన యుత్తరము వలన మీరౌదాసీన్యవృత్తిని వహించినట్లు తెలిసినది. మీకేపదార్థమును గురించి యిచ్ఛలేదట; శరీర సంరక్షణము చేసికొనరట; మీ సైన్యమును నూరక కూర్చుండ బెట్టినారట; మీరు రాజ్యకార్యము లేమియుజూచుటలేదట ; బైరాగి వేషము ధరించి యే పుణ్యక్షేత్ర మందైన గాలక్షేపము చేయవలయు నని తలంచుచున్నారట! ఈ వార్త విన్నప్పటినుండి మాకేమియు దోచుటలేదు. మన తండ్రియైన శహాజీ రాజుగారి యుదాహరణము మీ కనుల యెదుట నుండగా మీరిట్లు చేయుట యాశ్చర్యముగానున్నది. ఎన్ని సంకటములు వచ్చినను ధైర్యము వదలక పరాక్రమము చూపి వారఖండకీర్తిని సంపాదించినారు. ఈ సంగతులు మీకు దెలిసినవే. మేము వేరుగా జెప్పనక్కరలేదు. తండ్రిగారి సహవాసము మీకు నధికముగా లభించినందున వారి బుద్ధివైభవము మీరు పలుమారు

చూచియున్నారు. మే మెన్నియో సంకటములు గడచి యీ హిందూరాజ్యమును స్థాపించిన సంగతి మీకు దెలిసినదే. ఇన్ని సంగతులు మీకనుకూలముగనుండగా, సంసారమును ద్యజించి సన్యాసి యగుటయు, మంత్రులకే రాజ్యమంతయు నప్పగించి ధనమంతయు వారి నపహరింప నిచ్చుటయు, రాజ్యమును శరీరమును గృశింప జేయుటయు మీవంటి సుజ్ఞులకు దగునా? ఇదెట్టి తెలివి? మేము మీకు దండ్రికి మారుగానుండి మీ సంరక్షణ జేయుటకు సిద్ధముగా నున్నాము. మా వలన మీకు గీడు కలుగునని యెంత మాత్రము శంకింపవలదు. ఇక మీ రౌదాసీన్యమును బరిత్యజింపుడు. బైరాగివేషము ధరింపవలదు. సాంసారికకృత్యములను జరుపుచు నానందముగా గాలక్షేపము జేయవలయును. పండుగలు మొదలయిన మహోత్సవము లన్నియు బూర్వమువలెనే జరుపవలయును. రాజకార్యములను స్వయముగా జూచుచు, సైన్యములను యుద్ధమునకు సిద్ధముగా నుంచి, మంత్రి మొదలయిన యందరు సరదారులవలన వారి వారి పనులను చేయించుచుండవలయును. తండ్రిగారి వలె బ్రతిష్ఠ సంపాదింపవలయును. మీ కీర్తిని మేమెంతయు సంతసింప గలవారము. రఘునాథపంతు మీకు సమీపముననే యున్నారు. వారు మీకు గ్రొత్తవారు కారు. మీకు తోచనప్పుడు వారు మంచి సలహా చెప్పగలరు. నన్ను జూచినటుల వారిని జూడవలయును. ఇంతకు మీకు జెప్పవలసినది యేమనగా — సోమరితనమును విడిచి సైన్యమువలన దగిన పనుల గొనవలయును. ఇది పరాక్రమములు చూపవలసిన వయస్సు.

ముసలితనమున సన్యాసి కావచ్చును. కాన ధైర్యము నవలంబించి, నడుముకట్టి పరాక్రమము చూపి, మాకు సంతోషము కలుగ జేయుడి. సుజ్ఞుల కథకము వ్రాయనక్కర లేదు."

పై యుత్తరము వ్రాసిన కొన్నిరోజులకు, రాయగడము మీద నుండగా శివాజీకి మోకాటిమీద గడ్డ పుట్టి మిగుల బాధ కలుగజేసెను. ఏడు దినములవరకు జ్వరము విడిచినది కాదు. అప్పుడు తాను బ్రదుకనని తోచి, శివాజీ తన మంత్రుల నందరను బిలిచి యొద్ద గూర్చుండ బెట్టుకొని యిట్లు ముచ్చటించెను.

"మేము శ్రీ భవానికృపచేత హిందూసామ్రాజ్యమును స్థాపింపగలిగితిమి. యవనులవలన గోబ్రాహ్మణులకు గలుగు బాధను దొలగించితిమి. ఇన్నిరోజులు శ్రీ భవానీ మాసేవ నంగీకరించెను. ఇక నాకు నాయుర్మర్యాద పూర్తి యైనది. మా మనస్సులోని కోరిక లన్నియు బూర్తియైనవి. గాని యొక చింతమాత్రముతీరినదికాదు. మేము పోయినతరువాత మారాజ్య మెవ్వరు రక్షింపగలరు! పెద్దకుమారుడు భ్రష్టుడు; రెండవ కుమారుడు చిన్నవాడు. మేము పోయినతరువాత విజాపురము, జింజి మొదలయిన నవాబులు తల యెత్తగలరు. ఔరంగజేబు దక్షిణమునందలి రాజ్యము లన్నియు గెలుచుటకు యత్నించును. అయినను ముందు జరుగబోవుసంగతుల కిప్పుడు చింతించిన నేమిఫలము! ఇన్నిరోజులు రక్షించినభవానియే యికముందు రక్షింపగలదు. మీరందరు నేకభావముతో నుండి స్వరాజ్యమును, స్వమతమును రక్షింపుడి. శ్రీభవాని

మీకు జయము గలుగజేయును." ఇట్లుజెప్పి పరాక్రమతేజో రాశియగు శివభానుబింబము ఆదివారము అయిన ఏప్రిల్ (౧౬౮౦) తేదీని రెండుజాముల కస్తమించెను!

పృథ్వీతలమందు జన్మించిన ప్రతిభాపరాక్రమశాలు లని పేరొందిన, కీర్తిశేషులయిన మహాపురుషులలో శివాజీయొక్క-దని చెప్పుటకు సందేహములేదు. అత్యంత హీనదశయందుండిన మావళేలను, మరాటావారికి శౌర్యధైర్యంబులు బుట్టించి, వారి సాహాయ్యంబున మహారాష్ట్రరాజ్యంబను క్రొత్త రాజ్యంబు నిర్మించె. ఇటు విజాపుర, గోలకొండ నవాబులను, అటు ఢిల్లీశ్వరుండైన ఔరంగజేబును (దయ్యంబులవలె) నదివర కున్న హిందూరాజ్యంబులనే మ్రింగవలయు నని యత్నించుచుండ; వారిని ముసరి నడుమనే క్రొత్తరాజ్యంబు నిర్మించె! తన సైన్యంబులోడి పారగాజూచి తానుస్వయముగా ముందువచ్చి పారెడువారికి ధైర్యమిచ్చి యపజయమును జయముగా మార్చె.తనబలంబును నెదుటిబలంబునుజూచి, తగు రీతిగా మెలంగుటయందు ధీనిధి యనిపించుకొనియె. ఎంత గొప్పయాపద వచ్చినను నధైర్యపడకదానినిమించినయుక్తిని విచారించితప్పించుకొనియె. దళము నడుపుటయందును, వ్యూహము పన్నుటయందును, శత్రువులను మోసపుచ్చుటయందును జయము ప్రాప్తించినపుడు శత్రువులను దరుముటయందును, బరాభవము గలిగినప్పుడు తనసైన్యమునకు నధికనష్టము లేకుండ తొలగించి తీసికొనిపోవుటయందును, నసమానప్రజ్ఞ కలవా

డని ఖ్యాతివడసె ! అట్టి శివాజీ యద్వితీయశూరరత్నంబను టకు సందియంబు లేదు.

శివాజీయొక్క మరణవార్త వినగానే, యాతని జన్మ శత్రువైన ఔరంగజేబిట్లనియెనట ! 'శివాజీ గొప్ప సేనా నాయకుడనుటకు సందేహము లేదు. మేము దక్షిణములో రాజ్యములన్నియు ముంచుచుండగా నాతం డొక్కడుమాత్ర మసామాన్యసాహసంబు జూపి క్రొత్తరాజ్యంబును స్థాపించెను. నేటికి బందొమ్మిది సంవత్సరములనుండి మా సైన్యము లాతనితో బోరాడుచుండినను నాతని రాజ్యము దినదిన మభివృద్ధియే యగుచు వచ్చెను'

అలెగ్జాండరు, సీజరు, నెపోలియన్ మొదలైన సేనా నాయకులకంటె శివాజీ యధికుడని చెప్పుటకు సందేహము లేదు. అలెగ్జాండరు మొదలయినవారు శివాజీకంటె నధిక సైన్యములను నడిపిరి అధిక ప్రదేశములను జయించిరి, కాని వారంద్ర సేనానాయకత్వము వహించువరకు దేశములను జయించుటకు గావలసిన సాధనములన్నియు సిద్ధముగా నమర్చియుండెను. శివాజీయో క్రొత్తగా నన్నిసాధనములను సమకూర్చుకొని యుద్ధమునకు బయలుదేరెను. కూటికి గుడ్డకు లేని మావళేలాతని సైనికులు, మహారాష్ట్రుల స్వాతంత్ర్య మదివరకు నెన్నియో వందల సంవత్సరముల క్రిందట నడుగంటి తురకల సేవచేయుటకొరకే తమ్ము నీశ్వరుడు సృజియించెనని వారనుకొనుచుండిరి. శివాజీయొక్క సొంతతండ్రియు నాతనికి ననుకూలుడు కాడయ్యె ! ఇట్లు పరిస్థితి యంతయు బ్రతికూలముగా

నున్నను, దన ధైర్యసాహసప్రతిభలచే నూతన మరాటరాష్ట్రంబును సృజియించిన శివాజీ నసమాన సేనాని యనుటకు సందియంబు లేదు.

స్వదేశాభిమానంబును, స్వమతాభిమానంబును పరస్త్రీలయెడ మాతృభావము మొదలయిన యుత్కృష్ట సద్గుణంబులు శివాజీయందు వాసము చేయుచుండెను.

ఇక బరదేశస్థులైన చరిత్రకారులు శివాజీ యందున్నవనిన దుర్గుణములను గురించి కొలదిగా వ్రాసి ముగించెదము. మోసము మూఢదైవిక విశ్వాసము నను రెండు దోషములు ముఖ్యముగా, శివాజీయందారోపింపబడును. మోసము చేయుట దోషమని చెప్పుటకు సందేహములేదు. కాని మోసగాండ్రను మోసపుచ్చుట దోషమెపుడు, దోషముకానిది యిదమిద్ధమని నీతిశాస్త్రజ్ఞులు నిర్ణయించియుండలేదు. ఇది యొకప్పుడైనను నిర్ణయింపబడునని చెప్పుటకు వీలులేదు. ఏలయన నిట్టిచర్చ యెప్పుడు వచ్చినప్పటికి గొందరొక యభిప్రాయంబును సమర్థించుటయు, మరికొందరు విరుద్ధాభిప్రాయంబు సమర్థించుటయు దటస్థించును. ఊరు దోచుకొనుటకు బోవుచున్న దొంగలగుంపునకు నసత్యమాడి తప్పుత్రోవజూపి వారిని రక్షకభటులకు నప్పగించుట నీతియో, యనీతియో యెవరు గట్టిగా జెప్పగలరు? జనక్షేమంబే ముఖ్యముగా దలచువారు దీనిని నీతియనియే చెప్పెదరు. జనక్షయకరంబైనను రూక్ష్యసత్యంబె పరమంబని యెంచువారిది యనీతియని వాదిం

తురు. రాక్షసాధ్యక్షుండును, వర్ణనీయుదాతయు నగు బలిచక్రవర్తి యిట్లు చెప్పెను.—

క. మేరువు తలక్రిందైనను,
పారావారంబు లింకిపోయిన లోలో
ధారుణి రజమై పోయిన
దారార్థ్వము బద్ధమైన దప్పక యిత్తున్.'

నీతివిశారదుండును, రాజకార్యకుశలుండును నైన కృష్ణుడిట్లనియె—

'ఆ. ప్రాణహాని వచ్చు పట్టున సర్వధ
నాపహారవేళ యందు నడపు
సత్య మనృతమం డ్రసత్యంబు సూనృత
మని పరిగ్రహింతు రార్యజనులు.'

హిందూదేశములోని యింగ్లీషురాజ్యములకు గూటస్థుడని చెప్పదగు క్లైవుదొరగారిట్లు వ్రాసియున్నారు.—

'ఒట్టుసత్యంబులను లక్ష్యపెట్టని దుర్మార్గులతో వ్యవహరించునప్పుడు మనముమాత్రము ఒట్టు సత్యములచేత మనలను బంధించుకొని వాండ్రకున్నదియున్నటుల బూసగ్రుచ్చినటుల జెప్పుచుండుటయు, వాండ్రుమాత్ర మొకమాటయైనను మనకు జెప్పక, చేసెదమనిన పనులలో నొక్కటియు జేయకుండినను మనము మాత్రము వాండ్ర కిచ్చెద మనిన వరంబు లన్నియు నిచ్చుట యిట్టి ప్రవర్తనముచే నేనెప్పుడును శత్రువునుజయింప నేరను.'

మొఘాలే దొరవారు రాజకీయ వ్యవహారము నందేమి, సామాన్య వ్యవహారమునం దేమి సత్యమే ప్రధానము అని శాసించిరి.

ఇప్పటి లోకులు, పండితోత్తములు భిన్నరుచులై యున్నారు. సత్యవాదులతో నసత్యమాడవలయునని యెవ్వరును చెప్పరు. అసత్యవాదులతో నసత్యమాడవచ్చుననియు, మోసగాండ్రను మోసపుచ్చవచ్చు ననియు గొందరు సిద్ధాంతీకరించెదరు. శివాజీ శత్రువులందరును నసత్య ప్రవీణులును, మోసగాండ్రునునై యుండిరి. జయసింగు, ఖానిషా, విజాపురపు మసాఉద్ ఖాన్ మొదలైన కొలది తురుష్కులు మాత్రము శివాజీతో నిష్కపటముగా బవర్తించుచుండిరి. వారితో నుగల శివాజీ కపటము లేకయే వర్తించు చుండెను. అఫ్జల్ ఖాన్ ఔరంగజేబు మొదలైన వాండ్రందరును మోసగాండ్రు. వాండ్రతో నటులనే ప్రవర్తించెను. శివాజీయొక్క ప్రవర్తనంబు లోని రహస్యం బిదియె.

ఇక మూఢ దైవిక విశ్వాసమును గురించి విచారించెదము. శరీరమునందు భవానీదేవి ప్రవేశించి భవిష్యత్తును జెప్పునన్న సంగతులయందు శివాజీకి నమ్మక మున్నమాట నిజమే. కాని, పురాతన కాలపువారిని మనము వారి ధర్మ మతముల కై నిందించుట న్యాయముకాదు. మనము నమ్మజాలని సంగతులింకొకడు నమ్మినంతమాత్రముచేత నాతడు నిందకు బాత్రుడు కాడు. వేరువేరు పరిస్థితులలో నుండువారి నమ్మకములు వేరువేరుగా నుండవచ్చును. ముత్యాలమ్మ పోలేరమ్మ మొద

లయిన క్షుద్రదేవతల బూజించువాండ్రు శివకేశవుల బూజిం
చువారికి బిచ్చివారుగా గాన్పించుచున్నారు. శైవ వైష్ణవమతం
బులు, ఏకేశ్వరుల మను బ్రాహ్మసామాజికులకు విచిత్రంబుగ
నుండు. బ్రాహ్మసామాజికు లవాఙ్మానసగోచరుండగు సృష్టి
మొక్క యాదికారణంబునందు దయాదాక్షిణ్యము మొదలైన
మానవగుణంబు లారోపించి తమచెవుల కింపైనవాద్యములు
మందిరములో వాయించుచు నాటకములోని సూత్రధారునివలె
గానముచేసి ప్రార్థనచేయుట యస్వాభావిక మనియు విగ్రహా
ధానముకంటె పెద్ద విగ్రహారాధన మనియు స్పెన్సరీయ
(Herber. Spencer) యజ్ఞేయవాదులు(Agnostics)చెప్పు
దురు. ఒక్కొకరిమతంబు ఒక్కొకరికి సమ్మతంబు లగుట స్వభా
వికంబు ఇంతమాత్రముచే నొకరినొకరు నిందింపగూడదు.
పైసమ్మను బూజచేయువారిలో సజ్జనులు లేరా ? ఇంతయేల?
నాస్తికులలోను సజ్జనులు లేరా ? బ్రాడ్లావంటి మహాత్ముం
డరుదు గదా ! కావున, సందరకును మతద్వేషాభావంబు
(Religious Tolerance) ఉండవలయును. కాన మతవిశ్వా
సములను గురించి శివాజీని దూషించుటకు మనకు నధికారము
లేదు.

సమాప్తము.

**Printed for K. Vinayaka Rao, T. P. No. E-46, Copies 1000,**
**at Abhyudaya Press, [redacted] Bezwada.**